## ఉదకదాన విధిః--అత్రాపస్తమ్బః

(౪౦) కేశాన్ప్రకీర్య పాంసూనోప్యైకవాససోదక్షిణాముఖాస్సకృ
దుపమజ్యోత్తీర్యోపవిశన్తి, ఏకవాససోగ్రహణాదుత్తరీయ నిషేధః । సకృ
దుపమజ్య-న ద్విస్త్రిర్వా । ఏవం త్రిః, తత్ప్రత్యయముదకముత్సిచ్యాప్రతీ
క్షాగ్రామమేత్యయత్స్త్రియ ఆహుస్తత్కుర్వన్తీతి ॥ ఉపవిశన్తి-ఉపవిశ్య
పీడయేయుః - న ప్రహ్వీభూయ స్థిత్వావా ॥ తత్ప్రత్యయం-గోత్రనామ
గ్రహణ పూర్వకమిత్యర్థః ॥

## శిలా లక్షణమ్

తతశ్శిలాం సమాదాయచతురంగులమాయతమ్ । నాతిహ్రస్వం
నాతిదీర్ఘం స్ఫుటితన్తుపరిత్యజేత్ ॥ రక్తం శ్వేతన్తుపాషాణం వర్ణానా
ముత్తమోత్తమమ్ । బహువర్ణం నీలవర్ణం పాషాణన్తు పరిత్యజేత్ ॥
పాషాణస్య ప్రమాణన్తు ఆర్ద్రామలకమాత్రకమ్ । నచాధికం నైవహీనం
ప్రవదంతి మనీషిణః ॥ వ్యాసోఽపి-శసందగ్ధ్వా యథాన్యాయం దృష్ట్వా
జ్యోతిర్దిశస్తథా ॥ బాలాన్దారాన్ పురస్కృత్యగచ్ఛేత్ప్రేతమనీక్షకః ।
శుద్ధమస్ఫుటితంశ్లక్ష్ణం శ్వేతం లోహితమేవవా । పాషాణం తతఆదాయ
గత్వా తత్రమహాజలమ్॥ సచేలందండవత్స్నాత్వామలం ప్రక్షాళ్యవష్మర్
జమ్ । పునస్సచేలం స్నాత్వాఽథ వాగ్యతాస్సుసమాహితాః ॥ వృద్ధ
పూర్వాస్సగోత్రాశ్చ బాంధవాశ్చ సహోదకాః । సపిండాశ్చక్రమాత్ప్ర
తాః ప్రాచీనావీతిన స్తథా ॥ దక్షిణాభిముఖాభూత్వా దక్షిణాగ్రకుశే
షుహి । పాషాణం తత్రనిక్షిప్య కృత్వాతుపురతోఽవటమ్ ॥ నామగో
త్రేసముచ్చార్య ప్రేతస్తృప్యత్వితిబ్రువన్ । గర్తేసకృత్ప్రసించేయుస్తేః
పూర్ణం జలాంజలిమితి ॥ ప్రేతాశ్చవపనంకృత్వా స్నాత్వైకవస్త్రా
ఇత్యాది ॥

అత్ర విశేషమాహాపస్తంబః

ఏవమహరహరంజలినైకోత్తరవృద్ధిరై కాదశాహాదితి ॥ కర్తా, జ్ఞాతయశ్చ, ప్రథమదినే త్రీనంజలీన్ దద్యుః, ద్వితీయేచతురః, తృతీయేపంచ, ఏవందశదిన పర్యన్త మెకోత్తరవృద్ధ్యాదద్యుః, సంభూయపంచ సప్తత్యంజలయోభవన్తి ॥ "అంజలినైకోత్తరవృద్ధిః" ఇత్యభిధానాద్వాసోదకే నాస్త్యేకోత్తరవృద్ధిః। తత్తుప్రత్యహమాదశాహాత్ త్రిరేవదద్యుః। విష్ణుపురాణేచ= ప్రేతస్య తాపోప శాన్తి విశేషాపేక్షయాతు ప్రతిదిన మేకోత్తరవృద్ధ్యా ఉదకదానం కార్యమ్ ॥

తిలపరిమాణముక్తం విష్ణుపురాణే

తిలైః స్సప్తాష్టభిర్వాపి సమవేతం జలాంజలిమ్ । భక్తినమ్రస్సముద్దిశ్య భువ్యస్మాకం ప్రదాస్యతీతి ॥ స్మృతిరత్నే - అపసవ్యే తతః కృత్వా వస్త్రయజ్ఞోపవీతకే। దక్షిణాభి ముఖైర్వ్యాప్తైః దేయంతోయాంజలిత్రయమితి ॥ వస్త్రం నిష్పీడన వస్త్రమితి వ్యాచక్షతే ॥ వసిష్ఠః— సవ్యోత్తరాభ్యాం పాణిభ్యాముదక క్రియాం కుర్వీరన్నితి ॥

కేషుచిత్కామోదకమాహ

శ్వశ్రూశ్వశుర స్వస్రీయ మహిత్ర స్వస్రాదీనాం సఖ్యుర్‌ఋత్విజోశ్చ దాహాదిక మిచ్ఛయా కుర్యాత్। అత్రి యాజ్ఞవల్క్యౌ= కామోదకం సఖిపుత్రా స్వస్రీయశ్వశురర్త్విజామ్ ॥ పుత్రాః - పరిణీతా మహిత్ర భగిన్యాదయః ॥

ఋత్విగ్లక్షణమాహ—మనుః

అగ్న్యాధేయం పాకయజ్ఞా నగ్నిష్టోమాదికాన్మఖాన్ । యః కరోతి వృతో యజ్ఞై సతస్యర్త్విగిహోచ్యతే। ఇతి ॥ కామః - ఇచ్ఛా।

ప్రేతాభ్యుదయ కామనాయాం సత్యాం శ్వాశ్రాదీనాముదకం దేయమ్, అసత్యాం నదేయమితి, అకరణేప్రత్యవాయోనాస్తీత్యర్థః ॥ ఇతివిజ్ఞానేశ్వరః ॥

సపిండానాంమధ్యే కేషాంచిదుదకదాన ప్రతిషేధమాహ

అత్రోదాహరన్తి = క్లీబాద్యానోదకం దద్యుస్తేనా వ్రాత్యా విధర్మిణః । గర్భభర్తృద్రుహశ్చైవ సురాప్యశ్చైవ యోషితః । న బ్రహ్మచారిణః కుర్యురుదకం పతితా నచ ॥ క్లీబాద్యా ఇత్యాదిశబ్దాత్కుండగోళకాదయో గృహ్యన్తే । స్తేనాః - పరస్వాపహారిణః । వ్రాత్యాః - వ్రాత్యస్సంస్కారహీనస్స్యాదవకీర్ణీ క్షతవ్రత ఇతి లక్షణాః । విధర్మిణః - ప్రచ్యుత ద్విజాతిధర్మాః । గర్భద్రుహః - గర్భఘాతిన్యః । అత్ర లింగమ వివక్షిత మనుపాదేయత్వాదిత్యే తద్వ్యర్థ మనువచనమ్ ॥

జ్ఞాతిత్వే సత్యపి క్లీబాదయోనోదకం దద్యుః

ఉదకదాన నిషేధాదేవ దాహనిషేధః కైముత్యసిద్ధః । పతితాః - అథ పతనీయానిస్తేనాభిశస్త బ్రహ్మహసురాపగురు తల్పగా ఇత్యాపస్తంబ గౌతమాద్యుక్తాకారాః । అతః క్లీబాద్యా దాహాదికం న కుర్యుః ॥

ఏవముదక దానే కర్తృ విశేషప్రతిషేధముక్త్వా సంప్రదాన విశేష ప్రతిషేధమాహ

పాషండ్యనాశ్రమిస్తేనాః భర్తృఘ్న్యః కామగాదికాః । సురాప్య ఆత్మఘాతిన్యః నాశౌచోదకభాజనాః ॥ ఇతి ॥ అత్ర విజ్ఞానేశ్వరః = నరశిరః కపాలాది శ్రుతిబాహ్య లింగధారణం పాషండం తద్యేషాం తే పాషండినః - అధికారే సత్యకృతాశ్రమవిశేష పరిగ్రహాః - అనాశ్రమిణః । కామగాః - కులటాః । ఆత్మ త్యాగిన్యః - విషాగ్న్యుద్బంధనాద్యైరాత్మానంయాస్త్యజంతి । ఏతే పాషండ్యాదయః - అశౌచస్య, ఉదక

దానాద్యౌర్ధ్వ దైహికస్య చ భాజనా న భవన్తి । భాజయన్తీతి భాజనాః । సపిండాదీనా మాశౌచాది నిమిత్త భూతా న భవన్తీత్యర్థః ॥ అతస్తన్మరణే సపిండై రుదకదానాది న కార్యమ్ ॥ సురాప్య ఇత్యాదిషు పూర్వవల్లింగ మవివక్షితమ్ । పురుషాప్యేవం విధః ఔర్ధ్వ దైహికార్హో న భవతీతి సిద్ధమ్ ॥

ఏకోత్తరవృద్ధ్యా శ్రాద్ధమపి కర్తవ్యమిత్యుక్తం శ్రీధరీయే

(౪౧) శ్రాద్ధమేకోత్తరం వృద్ధ్యా కర్తవ్యన్తు దినేదినే । ఆవసానా ద్బలీనాన్తు ద్విగుణం ప్రత్యహం పర ఇతి ॥ ఏకోత్తరం యథా భవతి తథా వృద్ధ్యా బలీనామవసాన పర్యన్తం శ్రాద్ధం కర్తవ్యమ్ । పరే - అన్యే - ప్రత్యహం జలాంజలిభ్యో ద్విగుణం దేయ మిత్యాహురితి శేషః ॥ యస్తు సంస్కర్తా స ఏవైకోత్తర వృద్ధిశ్రాద్ధం కుర్యాత్ ॥ ఏతచ్చైకోత్తర వృద్ధిశ్రాద్ధం పిండబలిప్రదానా నన్తరం కర్తవ్యమ్ । నదీతీరకుండే శిలా స్థాపనం కృత్వా వస్త్రోదక తిలోదక దానమ్, తథా గృహద్వార కుండే చ శిలాస్థాపనం కృత్వా పునః వస్త్రోదకమాత్రం త్రిర్దత్వా పిండబలి ప్రదానం కర్తవ్యమిత్యయం పక్షః పితృమేధసారే ఉక్త ఇతి (వై) శ్రాద్ధకాండే ఽపిదర్శితః ॥

ద్వారకుండస్థానం శిలాసంఖ్యాం చాహ - శ్రీధరీయె

వామపార్శ్వే గృహద్వారే శిలాస్తిస్రో నిధాయచ । తాసు వస్త్రాణి సంపీడ్య సాయం ప్రాతర్బలింహరేదితి ॥ వామపార్శ్వే గృహ స్యాభిముఖం గతస్యేతి కైశ్చిద్వ్యాఖ్యాతమ్ ॥ తథాచ స్మృత్యన్తరమ్ = ద్వారస్య దక్షిణే పార్శ్వే బహిః కుర్యాద్యథాఽవటమ్ ॥ ఏకమశ్మాన మాదధ్యాదిష్టకాం వా ఽగ్రజన్మనామితి ॥ బహిః - గృహాద్బహిః, అంగణ ఇతి యావత్ ॥ గృహద్వార వామపార్శ్వే దక్షిణపార్శ్వయో ర్వికల్ప ఇత్యన్యే । శిలాత్రయ స్థాపనం బోధాయనీయానాం నియతమ్

తేషాం శిలాత్రయ స్థాపనస్య సాయం ప్రాతర్బలిదానస్య చ విధానాత్। ఇతరేషామ్ "ఏకమశ్మానమాదధ్యాత్, శిలాస్తిస్రో నిధాయచ" ఇత్య నయోర్వికల్పః ॥

## సంకటె తీరకుండె పిండదానమ్

కేచిత్, సంకటేషు, తీరకుండే తర్పణాన్తె పిండం దద్యాత్, ఏవమన్వహం పిండమేకైకం దద్యాదాశ్రాద్ధాత్తీరకుండ పాషాణేవా పిండం దద్యాదితి ॥ దేశాన్తరె ప్రేతకృత్యే తత్రి గృహాభావాత్తద్విషయమిద మితి సుధీవిలోచనె । అథజ్ఞాతయో దక్షిణాముఖా స్నాత్వేత్యాది (కనిష్ఠః ప్రథమం ఇతరె యథావృద్ధం కర్తా పశ్చాత్) ఇత్యుక్త క్రమేణ (అముష్యాద్య ప్రథమేఽహని క్షుత్తృష్ణాశాన్త్యర్థం వాసోదక తిలో దకదానం కరిష్యామీతి సంకల్ప్య). సవ్యం జాన్వాచ్యాముక గోత్రాయా ముకశర్మణే ప్రేతాయై తద్వాసోదకం దదామీతి త్రిగుణభుగ్నం (త్రివేష్టితం) సదశం (దశా-వస్త్రాన్తః) నవం - వాసస్సకృత్పీడయేయుః (త్రిగుణీకృత సదశవస్త్రాన్తకం) స్రావయేదితి విధిః ॥ ఏవం స్నాత్వా స్నాత్వాత్రిః పీడయేయుః - అశక్తౌ త్రిర్నిమజ్య త్రిర్వాసోదకం దత్వా। తిలదర్భైస్సార్ధం త్రీంస్త్రీన్ జలాంజలీంశ్చ దద్యుః। (అశక్తౌ-సకృదుప మజ్యేత్యాది క్రమేణ పునశ్చైవం కర్తుమశక్తౌ) త్రిర్నిమజ్య త్రిః కృత్వోవాసః పీడయేయుః ॥ సకృన్నిమజ్య త్రిరుదకాంజలిం దద్యా దిత్యాశ్వలాయనః।

## వాసోదకాది దానవిధిః

"ప్రేతం వాసోదక తిలోదకం ప్రాప్నోతు" ఇతివిధిః "అముష్మై ప్రేతాయ వాసోదక తిలోదక దానమ్" ఇతి భాష్యో క్తమ్. ॥ యుక్తం చైతత్ "కర్మణా యమభిప్రైతిస సంప్రదానమ్,

చతుర్థీ సంప్రదానే, తాదర్థ్యే చతుర్థీవక్తవ్యా" ఇత్యనుశాసనాను గుణ్యాత్। తదేవం సతి "సలిల దర్భేష్వసావేతత్త ఇతి జలాంజలీన్ దద్యుర్బాలపురస్సరాస్సపిండాః" ఇత్యఙ్గిరోముఖరితం ప్రకారాన్తరం స్వస్వ గృహ్యానుక్తౌ గ్రాహ్యమ్। ఏతచ్చ క్షౌరం కృత్వైవోదకం దేయమ్। "ప్రదద్యుర్జ్ఞాతయస్సర్వే క్షౌరం కృత్వా తిలోదకమితి స్మృతేః ॥ తాపోపశమనం స్నానం తృష్ణోపశమనం జలమ్। క్షుధోప శమనం పిండం ప్రేతకర్మసమాచరేదితి యల్లాజీయే ॥

## తిలోదక సంఖ్యా విషయే పక్షాన్తరాణి ఉదకదాన ప్రకారశ్చ

దశాహాత్పంచ పంచాశత్ పంచసప్తతిరేవవా। శతం వాఽంజలయ స్తేషాం పక్షే ష్విచ్ఛానియామికేతి ॥ సప్తత్యాఽంజలయః కేచిదిత్యాది ॥ ఉదకదానవత్పిండదానం న సర్వైః కార్యమ్, అపితు సంస్కర్త్రైవ ॥ తథాఽఽహ సంవర్తః—పూర్వాహ్ణే వాఽపరాహ్ణే వా తోయమాశౌచ గామిభిః। సంస్కర్త్రైవ బలిర్దేయస్సహి ప్రేతస్య బాంధవ ఇతి ॥ బలిరితి పిండస్యాప్యుపలక్షణమ్। అతస్సంస్కర్త్రా వ్యతిరిక్తైరాశౌచిభి స్సపిండైః సోదకైశ్చ, తోయం-జలాంజలిమాత్రమ్, దేయమిత్యర్థః ॥ ఉదకపిండ బలిప్రదానే చతుర్థీ, తతస్సంబుద్ధిరిత్యుపదేశః ॥ మంత్రకరణ ఏవతిష్ఠతేశ్చాత్మనేపదవిధానాత్ ఉపతిష్ఠ ఇత్యేవప్రయోగస్సాధుః। అతఏవ హ్యభియుక్తైరుక్తమ్। అముకాసావిమం పిండం ఉపతిష్ఠేతి మంత్రత ఇతి ॥ యథా-అముష్మై ప్రేతాయ ఇమం పిండం దదామి ఇతిదత్వా అముకప్రేత ఏతం ఏతానివా ఉపతిష్ఠ ఇత్యుపస్థాయేతి ॥

## పిండద్రవ్యం ద్రవ్యనియమం చాహ శునః పుచ్ఛః

శాలినా సక్తుభిర్వాఽపి శాకేనాప్యథ నిర్వపేత్। ప్రథమేఽహని యద్ద్రవ్యం తదేవస్యాద్దశాహికమితి ॥

కర్తృ నియమో గృహ్యపరిశిష్టేఽభిహితః

అసగోత్రస్సగోత్రో వా యది స్త్రీ యదివా పుమాన్ । ప్రథమేఽహని యః కుర్యాత్స దశాహం సమాపయేదితి ॥

స్థాన నియమ ఉక్తః స్మృత్యన్తరే

ఏకత్ర నిక్షిపేత్ప్రేతాన్ దశపిండాంత్సమాహితః । స్థాన భేదే మహాన్ దోషః పిండభుఙ్నరకం వ్రజేదితి ॥ పిండభుక్ - ప్రేతః ॥

అన్యత్రాపి, ద్రవ్యాదిభేదం న కారయేదిత్యాహ

ద్రవ్య భేదే మహాహానిః కర్తృభేదేత్వనర్థతా । స్థానభేదే మహాన్ దోష,స్త్రీభేదస్తు న కారయేదితి ॥

కర్తుః పిండార్థం చరుశ్రపణ విధిమాహ - అఖండాదర్శే

తతో గృహం సమాగమ్య చరుం కుర్యాత్స్వయం తతః । ద్విః ప్రక్షాళ్యతు తద్రవ్యం కర్తవ్యం శ్రపణం తతఇతి ॥ బ్రహ్మపురాణేఽపి గృహాద్బహిశ్శుచౌదేశే గోమయేనోపలేపితే । లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య స్నాత్వా పాత్రేణ తేజసా ॥ మృన్మయేనాపి కర్తవ్యం శ్రపణం పితృయజ్ఞవత్ । అభిఘార్య తముద్వాస్య పునరప్యభిఘార్యచ ॥ పాషాణం పురతస్థాప్య వాగ్యతో దక్షిణాముఖః । దక్షిణాగ్రాన్కుశాంస్తీర్య దద్యాత్తేషూదకం సకృత్ ॥ నామగోత్రే సముచ్చార్య పిండం దద్యాదమంత్రకమ్ । పునస్తత్రోదకం దద్యాద్గంధ పుష్పైరథార్చయేత్ ॥ ధూపదీపౌ తథాదద్యాదేవం దశదినేషుతు। వాయసేభ్యో బలిం దద్యాద్వైవ స్వత వరంస్మరన్ ॥ అగ్నౌజలేవా నిక్షిప్య స్నాత్వా శీఘ్రద్గృహం వ్రజేదితి। ప్రేతపిండ వ్యతిరిక్తం బలిం వాయసేభ్యోదత్వా తం ప్రేతపిండం చరుపాకాగ్నౌ జలేవానిక్షిప్య స్నాయాదిత్యర్థః ॥ విజ్ఞానేశ్వరీయే - నవభి

ధికాప్సైదద్యాన్నవ పిండాంత్సమాహితః । దశమం పిండముత్సృజ్య రాత్రిశేషే శుచిర్భవేదితి । ప్రత్యహమేకైక పిండాభిప్రాయేణ । ప్రేతేభ్యస్తు సవర్ణేభ్యః పిండాన్ దద్యుర్దశైవత్వీతి దశ పిండస్మరణాత్ప్రత్యహమేక పిండవిధానాచ్చ ॥ ఏకస్మిన్నేవకాలే పిండదానమ్ “ సాయం ప్రాతర్బలిం హరేదితి వచనేన” సాయం బల్యర్థం ద్వితీయమపి పిండం శిష్టా ఆచరంతి ॥

## పిండపరిమాణం తత్కరణ ప్రకారంచాహాశ్వలాయనః

యత్రస్యుర్బహవః పిండాస్తత్ర బిల్వ ఫలోపమాః । యత్రచైకో భవేత్పిండస్తత్రాశ్వ ఖుర సంమిత ఇతి ॥ స్మృత్యంతరే– ప్రాయఃపిత్ర్యేషు పిండాస్స్యుర్మానేన బదరోపమాః । సర్వత్ర సుదృఢాహిస్యుర్వర్తులాశ్శ్రాద్ధకర్మసు ॥ ఇత్యాది పరిమాణవచనాని మాసిశ్రాద్ధపిండదానప్రకరణే విస్తరేణ ప్రపంచితాని । బోధాయనశ్చ = ముష్టిపరిమాణం కుక్కుటాండ ప్రమాణం వా తిలమిశ్రం పిండంపరిదాయ గంధ పుష్ప ధూప దీపాదీన్ దత్వా సంక్షాళనేనాపసవ్యం పరిషిచ్య ప్రేతపిండమప్సు విసర్జయేదితి ॥ యస్మిన్పాత్రేఽన్నముత్పాద్య పిండః క్రియతే తత్పాత్రక్షాళన తోయం సంక్షాళనమ్ । అప్సు విసర్జయేదితి నియమవిధానాన్నాన్యత్రవినియోగః ॥

## విసర్జనప్రకారమాహాపస్తంబః

ఆకాశం గమయేత్పిండం జలస్థో దక్షిణాముఖః । పితౄణాం స్థానమాకాశం దక్షిణాదిక్తథైవచేతి ॥ కేచిత్ బలిమదత్వా ప్రేతపిండమేకమేవదత్వా తం వాయసేభ్యో దద్యుః ॥ తత్రప్రమాణం – తద్రూపాః పితరస్తత్ర ప్రచరంతీతిహి శ్రుతిః । కాకాద్యభావే ఉదకే క్షిపేత్ ॥ ఉదకం పిండదానం చ పునరప్యుదకం నయేత్ । వాయసేభ్యోబలిందద్యాద్వైవస్వతమనుం స్మరన్ ॥ అగ్నౌ జలేవా నిక్షిప్య స్నాత్వా వ్రజేద్గృహం

వ్రజేదితి యల్లాజీయే ॥ యత్తు శంఖలిఖిత వచనమ్ = బలిం బలిభుజో యత్రాప్రదత్తం నైవ భుంజతే । నైవ తృప్తాః ప్రయాస్యంతి పితరస్తస్య సానుగాః ॥ ఇతి తద్గయాదౌ దత్తపిండవిషయమితి పితృమేధసారకృత్ ॥

## నవశ్రాద్ధమ్

(౪-౨) ప్రథమేఽహని సంకల్ప్య ఆమరూపేణ సదక్షిణం నవ శ్రాద్ధమేకం దద్యాత్ ॥ ఏవమేకాదశాహాద్విషమేషు షణ్ణవశ్రాద్ధాని దద్యాత్ ॥ తదాహాఙ్గిరాః = ప్రథమేఽహ్ని తృతీయేఽహ్ని పంచమే సప్తమేతథా । నవమైకాదశేచైవ షణ్ణవశ్రాద్ధముచ్యత ఇతి ॥ యత్తు దేవల వచనమ్ = తృతీయె పంచమేవాపి సప్తమే నవమే తథా । అహ న్యేకాదశేచైవ నవశ్రాద్ధాని పంచవై ఇతి ॥ తదాశ్వలాయన విషయమితి ॥

## ఆమశ్రాద్ధే విశేషమాహవ్యాసః

ఆమం దదతు కౌంతేయ దద్యాదన్నాచ్చతుర్గుణమ్ । సిద్ధాన్నేతు విధిర్యస్స్యాదామశ్రాద్ధేఽప్యసౌవిధిః ॥ ఇత్యాది ॥

## స్మృతిముక్తాఫలే - శవాగ్న్యనుగత ప్రాయశ్చిత్తమాహ సంగ్రహకారః

నష్టేశవాగ్నౌ తద్భస్మ సంస్పృష్ట్వాఽరణి మంథనమ్ । లౌకికాగ్న్యాహృతి స్స్మార్తే సర్వ చిత్తం ద్వయోస్సమమితి ॥ ఆహితాగ్నే ర్మథితాగ్నిః, అనాహితాగ్నే ర్లౌకికాగ్నిః, ఉభయత్ర సర్వప్రాయశ్చిత్తం సమమిత్యర్థః ॥ * అత్ర విశేషమాహ బోధాయనః = అథయద్యుపనయ నాగ్నిర్వివాహాగ్నిర్జాతకర్మాగ్నిశ్శ్మశానాగ్నిరా చతుర్థాదాదశాహాదాస్థి సంచయనాదనుగతస్స్యాదిత్యారభ్యప్రాయశ్చిత్తం జుహుయాదిత్యన్తమ్ ॥ సూత్రమిదం వ్యాఖ్యాతం పితృమేధ సారకృతా ॥ యదిశ్మశానాగ్నిరను

గతస్స్యాత్తతస్సంకల్ప్య "అపహతా అసురాః" ఇతి తద్భస్మ ప్రోక్ష్య "అయన్తేయో నిర్ బుత్వియః" ఇతి సమిధి సమారోప్య, లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య "ఆజుహ్వానః - ఉద్బుధ్యస్వ" ఇతిద్వాభ్యాం తాం సమిధ మాధాయ ప్రజ్వాల్య పరిస్తీర్యాజ్యం దర్వీంచ సంస్కృత్య సమస్తమప్ర దక్షిణం పరిషిచ్య "అయాశ్చ - అగ్నిర్హోతా" ఇతి ద్వాభ్యామ్, "బ్రాహ్మణఏకహోతా" ఇత్యనువాకె నచ ప్రతివాక్య చతుష్టయమ్ "మనోజ్యోతిర్జుషతామ్-యన్మఆత్మనః" ఇతిద్వాభ్యామ్ "భూరగ్నయేద" ఇతి చతుర్భిర్వ్యాహృతిభి ర్వ్యస్తాభి స్సమస్తాభిశ్చ హుత్వా, పూర్వవత్పరిషిచ్య తతఃకర్మ ప్రతిపద్యత ఇతి ॥ * కారికాచ = ఉపా యనాగ్నౌ చ వివాహవహ్నౌ శవానలే సూతకపావకేచ । శాన్తేఽప హత్యాఽపహతేతి మంత్రాచ్ఛన్నో దేవ్యాఽద్భిరవోక్ష్య భస్మ॥ తద్భస్మ చారోప్య సమిధ్యయంత ఆజుహ్వా ఉద్బుధ్య బుచోద్వయేన । లోకాగ్నా నలే తాం సమిధం నిధాయ పరిస్తరాజ్యోత్పవనాది కృత్వా ॥ అయాశ్చ పంచహోతాచ బ్రాహ్మణ ఏకహోతా దశ । మనస్వతీచమిందాచమహా వ్యాహృతయస్తథేతి ॥

హేమాద్రౌ - అథాస్థి సంచయనాత్ప్రాక్ప్రేతాగ్ని నాశే తథా వివాహాదావపి ప్రాయశ్చిత్తమాహ దేవలః

ప్రేతాగ్నిశ్చ వివాహాగ్నిర్వ్రతాగ్నిర్జాతకర్మణి । నష్టేహృత శ్చోపహతశ్శాంత శ్చేత్త్రి దోషభాక్ ॥ నష్టః-అపసరణమ్ ॥ నానా దిక్షు హృతోఽజ్ఞానిభిర్గృహీతః । ఉపహతః - అన్యాగ్ని మేళనమ్ ॥ శాన్తోనష్టప్రాయః । ఏతేషాంచతుర్విధానామగ్నీనాంమేళనప్రాయశ్చిత్తం కూర్మ పురాణేపిపూర్వవదేవోక్తమ్ ॥ కృత్వా విప్రస్తతఃపశ్చాత్తత్కర్మ సమాపయేత్ । ప్రాయశ్చిత్తవిహీనం యత్తత్కర్మ విఫలం భవేత్ ॥ స్థాలీపాకానంతరం శేషహోమపర్యంతం వివాహాగ్ని నాశే ఏతదేవ

ప్రాయశ్చిత్తమ్ ॥ ఉపనయనాదూర్ధ్వం చతుర్థీ హోమ పర్యన్తం శాస్త్రే తదేవ ॥ శిశౌ జాతే తదా జాతకర్మ కృత్వా ఫలీకరణ హోమాగ్నౌ దశ రాత్రిమధ్యే శాంతే తదేవ॥ శవాగ్నౌ తుస్పష్టమ్ ॥ ఇతి హేమాద్రినిరచితమ్॥

## నిశాది మరణప్రాయశ్చిత్తం నైకర్చ విధినేతి స్మృత్యన్తరే

నిశాయాం కృష్ణపక్షే దక్షిణేచాయనే మృతౌ । తాసూర్యేత్యాది షణ్మన్త్రైర్జుహుయాత్తు పృథక్పృథక్ ॥ చతుర్గృహీతేనాజ్యేన దాహక స్తుసమాహితః । పితృమేధ విధానేన దహ్యాతేయస్సుతాదిభిః ॥ తాసూ ర్యేత్యాది తస్యైవ ప్రాయశ్చిత్తముదీరితమ్ । ఏకర్చ విధినాదాహే ప్రాయశ్చిత్తన్తు నేష్యత ఇతి ॥

## సర్పహత ప్రాయశ్చిత్తం విజ్ఞానేశ్వరీయే విశేషః

సువర్ణతారనిష్పన్నం నాగంకృత్వా తథైవగామ్ । వ్యాసాయదత్వా విధివత్పితురానృణ్యమాప్తవానితి ॥ వ్యాసాయ-వేదవిద ఇతియావత్ ॥

## పర్యుషిత శవ ప్రాయశ్చిత్తమాహ గార్గ్యః

పంచవింశ ఘటీపూర్వం దివా ప్రేతస్య సంస్కృతిః । దివావాయ దివారాత్రౌ శవస్తిష్ఠతి కర్హిచిత్ ॥ తత్పర్యుషిత మిత్యాహుర్దహనే తస్యకాగతిః । బ్రాహ్మణేభ్యో విధింలబ్ధ్వా కృచ్ఛ్రత్రియమథాచరేత్ ॥ పంచగవ్యేన సంస్నాప్య పావమాన్యాభి మంత్ర్యచ । జలేనస్నాపయి త్వాచ విధివద్దహనం చరేత్ ॥ అన్యథా దహనేతస్య సర్వంతన్నిష్ఫలం భవేదితి ॥

॥ ఇతి పర్యుషిత శవ ప్రాయశ్చిత్తమ్ ॥

☞ యత్త్రిస్త్రియ ఆహుస్తత్కుర్యాదిత్యత్ర భోధాయనేన బహుధోక్తమ్

తద్యథా-మృతదినే పుత్రాదిప్రేషణముఖేన బన్ధుజ్ఞాపనమ్, పుత్రాగ్నిద్యానయనమ్, జ్ఞాతిభిస్తండులాన్నాది ప్రదానమ్, సంచయే పంచభక్ష్యాదిదానమ్, దశాహే ప్రభూత బల్యపూపాదిప్రదానమ్. రాత్రౌ ఘానా పూపాదిప్రదానమ్, అపరరాత్రే తద్బంధుభిః మృతభర్తృకాయై వస్త్రదానమ్, ఏకోద్దిష్టభోక్త్రే మృతవస్త్రాఙ్గుళీయక జలపాత్ర భుక్తిపాత్రాది దానమిత్యాది, యచ్చ కించిత్ స్త్రియ ఆహుస్తచ్చ సర్వం కుర్యుః ॥

ఏవం స్త్రీభిరుక్తమపి కర్తవ్యమిత్యత్ర ప్రమాణమాహ కాత్యాయనః

యద్యపిస్యాత్త్రిలోకజ్ఞః త్రైలోక్యాకర్షణ క్షమః । తథాఽపి లౌకికాచారం మనసాఽపి న లంఘయేదితి ॥



# దుర్మరణ నిమిత్తాని

బ్రాహ్మణాముదకాత్సర్పాద్గోభిః పశుమృగాదిభిః । ఉద్బంధనోదకవిషైస్సర్పాద్యుపల వైద్యుతైః ॥ ప్రమాదాన్మరణేచాంద్రం తప్తకృచ్ఛ్రత్రయం తథా । యద్వా షాణ్మాసకృచ్ఛ్రాణి గా దద్యాద్దశ పంచవా ॥ ఛాగలేయః = చండాలా ముదకాత్సర్పాద్బ్రాహ్మణాద్వైద్యుతాదపి । దంష్ట్రిభ్యశ్చ పశుభ్యశ్చ మరణం పాపకర్మణామ్ ॥ తేషాం పాప విశుద్ధ్యర్థం షాణ్మాసం కృచ్ఛ్రమాదిశేదితి ధర్మశాస్త్రానుసారేణై తేషా

మన్యతమప్రకారేణ పంచదశ కృచ్ఛ్రాణి భవన్తి ॥ మనువర్జనాన్తు విప్రాణాం గర్హితే మరణేసతి । సద్యఏవ క్రియాః కార్యా విప్రాణా మనుశాసనాదితి ॥ అపరార్కేఽచ = మర్మృతా సద్యఏవస్యాత్సంస్కారోహి ద్విజన్మనామ్ । లబ్ధ్వా కృచ్ఛ్రాణి విప్రేభ్యః ఇతి ధర్మవిదాం మతమితి వచనాత్సద్య ఏవ సంస్కారోభవతి ॥ స్మృత్యన్తరే = ప్రాజాపత్యాది కృచ్ఛ్రం చ తప్తకృచ్ఛ్రత్రయన్తథా । చాంద్రాయణన్తతః కుర్యాన్నారాయణ బలిన్తథా ॥ కృత్వైతద్వత్సరస్యాన్తే విదధీతౌర్ధ్వదైహికమ్ । షణ్మాసా ద్ద్విగుణం కార్యం త్రిమాసా త్త్రిగుణం భవేత్ ॥ చతుర్గుణం త్రిపక్షేస్యాత్సద్యః పంచగుణం భవేదితి ॥ అనేన వచనేన సద్యస్సంస్కారపక్షే పూర్వోక్తాని పంచదశకృచ్ఛ్రాణ్యేవ పంచగుణితాని భవన్తి ॥ పంచసప్తతి సంఖ్యాకప్రాజాపత్యకృచ్ఛ్రాత్మకంప్రాయశ్చిత్తం పాపాపనోదకం భవతీతి నిశ్చయేన మర్మరణ ప్రాయశ్చిత్తంకుర్యాత్ ॥

అత్రక్వచిదపవాదః పురాణేశ్రూయతే

ప్రమాదాదపి నిశ్శంకమకస్మాన్మృత్యునామృతః ॥ శృంగిదంష్ట్రి నఖివ్యాళ విషవిద్యుజ్జలాదిభిః ॥ చండాలై రథవాచోరైర్నిహతో యత్ర కుత్రచిత్ । తస్య దాహాదికం కార్యం యస్మాన్న పతితస్తు సఇతి ॥

తత్రాపి ప్రాయశ్చిత్తోత్తర కాలమేవ క్రియాః కార్యాఇత్యఙ్గిరాః

యదికశ్చిత్ప్రమాదేన మ్రియతేఽగ్న్యుదకాదిభిః । తస్యాశౌచం విధాతవ్యం దద్యాత్పిండోదకక్రియామితి ॥

అత్రవిశేషమాహ - గౌతమః

యస్యతు ప్రాణాన్తికం ప్రాయశ్చిత్తం సమృతశ్శుద్ధ్యేత్ । సర్వాణ్యేవోదకాదీని ప్రేతకృత్యాని కుర్యురితి ॥

మహారోగాదిభిరకామతో మృతస్య పురాణే

మశ్చికిత్స్యైర్మహారోగైః పీడితస్తు పుమాన్యది । ప్రవిశేజ్జ్వలనం దీప్తం కుర్యాదనశనం తథా ॥ అగాధతోయరాశిం చ విషంపీత్వాచకో పతః । విప్రాగ్న్యుదకచండాల శృంగి దంష్ట్రిభిశస్త (త్ర) తః । అకామతో మృతా నాన్తు (దాపయె) ఆహ రేజైందవద్వయమితి ॥

అకృత చూడవిషయె అపరార్కే

చండాలాదగ్నినావాఽపి విద్యుతా బ్రాహ్మణేనవా । పథివా పశునా వృక్షాత్పతేనోద్బంధనేనవా ॥ జలేవా భోజనేవాఽపి యఃపంచత్వముపాగతః । తస్య పాప విశుద్ధ్యర్థం తప్త కృచ్ఛ్రం సమాచరేదితి ॥

తథాఽనుపనీతవిషయె బృహదఙ్గిరాః

ప్రమాదాన్మ్రియతె యస్తు భృగ్వగ్న్యనశనాంబుభిః । తస్య పాపవిశుద్ధ్యర్థం కృచ్ఛ్ర షట్కం విధీయత ఇతి ॥

అనుపనీత విషయె బుద్ధిపూర్వక మరణే సఏవ

అష్టౌ కృచ్ఛ్రాణివా కుర్యాచ్చాంద్రాయణ మథాపివా । తస్య పాపవిశుద్ధ్యర్థమఙ్గిరా మునిరబ్రవీత్ ॥ అథ కశ్చిత్ప్రమాదేన మ్రియేతా గ్న్యుదకాదిభిః । చండాలై రన్త్యజైశ్చైవ వ్యాఘ్రసర్పాదినాతథా ॥ పశుభిశ్చతథాచోరై ర్విషాద్బంధన శస్త్రకైః । తస్య పాప విశుద్ధ్యర్థం షాణ్మాసం కృచ్ఛ్రమాచరేదితి ॥

కృచ్ఛ్ర ప్రతినిధిమాహ యజ్ఞపార్శ్వః

ప్రాజాపత్యే భవేద్ధేనుస్తప్తస్నాన్తపనేతథా। మహాసాన్తపనేత్రిస్రో ద్వేతు సాన్తపనే తథా ॥ పంచచాంద్రాయణే ప్రోక్తాశ్చతస్రోవాఽపి థే

నవః । పరాకెద్వేతు నిర్దిష్టే తప్త కృచ్ఛ్రేత థైవచ ॥ ద్వేతుకృచ్ఛ్రే సమాఖ్యాతె ధేనుపంచపురాణికాః । నిష్కంసాన్తపనేతిస్రోద్వేతు సాన్తపనేఽథవా ॥ పంచచాన్ద్రాయణే ప్రోక్తాశ్చతస్రోవాఽపిధేనవః ॥

నిష్కవిషయె నారద శ్చతుర్వింశతిమతే

ప్రాజాపత్యేతు గామేకాం ద్వయం సాన్తపనేతథా । పరాకతప్త కృచ్ఛ్రేషు తిస్రస్తిస్రస్తుగాస్స్మృతాః ॥ అష్టౌచాన్ద్రాయణేదేయాః దక్షిణాస్తు విశేషతః । యథా విభవసారేణ దానందద్యాద్విశుద్ధయె ॥ అష్టౌ చాన్ద్రాయణేదేయా ఇతి ధనికవిషయమ్ ॥ అశక్తౌతు = చాన్ద్రాయణ పరాక కృచ్ఛ్రాతికృచ్ఛ్రాస్తు ప్రాజాపత్య త్రయాత్మకాః ॥ ఇతి కృచ్ఛ్ర ప్రత్యామ్నాయాః ॥



# అథ దుర్మరణ ప్రాయశ్చిత్తప్రయోగః

ప్రా...మ్య - దేశకాలౌ సంకీర్త్య అముకస్య అముకగోత్రస్య శర్మణః అముష్య ప్రమాదాద్వా చండాలాద్యముకనిమిత్తైర్హతస్య దుర్మరణజనితపాపాపనోదకం ప్రాయశ్చిత్తం పరిషదనుజ్ఞాపూర్వకం కరిష్యామీతి సఙ్కల్ప్య । పరిషద్దక్షిణాం గృహీత్వా పరిషదం త్రిః ప్రదక్షిణీ కృత్య దండవత్ప్రణమ్య విజ్ఞాపయేత్ - అశేషే హేపరిషత్... యథోక్తదక్షిణామివస్వీకృత్య అముకస్యాముక గోత్రస్యాముక శర్మణః అముష్య ప్రమాదాదముకనిమిత్తాద్ధతస్య దుర్మరణజనిత పాపాపనోదకం ప్రాయశ్చిత్తం నిశ్చిత్యోపదిశ్య మామనుగృహాణ, ఇతి విజ్ఞాప్య పరిషదె దక్షిణాం సమర్ప్య పునః ప్రణమేత్ ॥ పరిషదపి యజమానేన విజ్ఞాపితస్య

ప్రమాదాదముక్తైర్హత నిమిత్తస్య దుర్మృతస్య పంచసప్తతి సంఖ్యాక ప్రాజాపత్యకృచ్ఛ్రాత్మకం ప్రాయశ్చిత్తం పాపాపనోదకం భవతీతి నిశ్చిత్య యజమాన అముష్య చండాలాద్యైర్హతస్య దుర్మృతస్య ప్రాయశ్చిత్తం సద్యస్కాలత్వాత్ పంచగుణితం పంచసప్తతిసంఖ్యాక ప్రాజాపత్యకృచ్ఛ్రాణి సముద్రగా మహానదీస్నాన ధేనుదానాది శక్య ప్రత్యామ్నాయ రూపేణాచర । అస్మిన్ ప్రాయశ్చిత్తే సమ్యగాచరితే సతి తవపిత్రాదేః త్వదుక్తనిమిత్తాత్పాపాన్ముక్తో భవిష్యతి – ఇత్యుపదిశేత్ ॥

తతః కర్తా ప్రా...మ్య, దేశకాలౌ సంకీర్త్య పిత్రాదేర్గోత్రస్య శర్మణః అముష్య చండాలాద్యైర్హతస్య దుర్మృతస్య నైమిత్తిక పాపాపనోదకం పరిషదుపదిష్టం ప్రాయశ్చిత్తం శక్య ప్రత్యామ్నాయ రూపేణాచరిష్యామి। ఇతిసఙ్కల్ప్య ॥ పంచసప్తతి సంఖ్యాక ప్రాజాపత్యకృచ్ఛ్రాణి ధేనుదాన సముద్రగా నదీస్నానాది ప్రత్యామ్నాయ రూపేణాచరిత్వా మహానద్యాం మృత్తికాస్నాన కర్తృభ్యః ఫల స్వీకరణార్థమాగ్నేయం హిరణ్యం తేభ్యస్తేభ్యస్సంప్రదదే నమమ – ఇతి దక్షిణాం దత్వా పరిషదం ప్రార్థయేత్, అస్మత్పిత్రాదేః గోత్రశ్శర్మా చండాలాద్యైర్దుర్మరణ జనిత పాపాన్ముక్తో భవతు ఇతిభవన్తోబ్రువన్తు – ఇతిబ్రూయాత్ – పరిషదపి ఉచ్చైః తథాఽస్త్వితి బ్రూయాత్ । ఏవం ప్రాయశ్చిత్తం కృత్వా ॥

## నారాయణ బలిఙ్కుర్యాత్ తత్ర వృద్ధ యాజ్ఞవల్క్యః

నారాయణబలిః కార్యో లోకగర్హాభయాన్నరైః । తతస్తేషాం భవేచ్ఛౌచం నాన్యథేత్యబ్రవీద్యమ ఇతి ॥ వ్యాసోఽపి = నారాయణంసముద్దిశ్య శివం వా యత్ప్రదీయతే । తత్ర శుద్ధికరం కర్మ తద్భవేన్నైతదన్యథేతి ॥ అఙ్గిరాః = నారాయణబలిః కార్యో దుర్మృతా దుర్మృతస్యతు । సంవత్సరే వ్యతీతేవా తదర్ధే పాదఏవవా ॥

మనుః = సర్వేషామేవలోకానాం గురుర్నారాయణోహరిః । తస్య సంపూజనంకార్యం సర్వపాపహరం హి తత్ ॥ తముద్దిశ్య బలిఃకార్యో దత్తోఽపిమరితాపహః । మంత్రసంస్కారహీనస్తు సుగతిం ప్రాపయిష్యతి ॥ అతో నారాయణబలినా ప్రేతశ్శుద్ధ్యేత్ ॥ అనేనద్వారేణౌర్ధ్వదేహిక శ్రాద్ధాది సంప్రదానయోగ్యత్వం జనయతీతి తేషామప్యౌర్ధ్వదేహికం సర్వంకార్యమేవ ॥ యేమృతాః పాపమార్గేణ తేషాం సంవత్సరాత్పరమ్ । నారాయణబలింకృత్వా కుర్యాదూర్ధ్వక్రియాంద్విజః ॥ ఇతివచనాచ్చ- ; పూర్వం నారాయణబలిం కృత్వా పశ్చాత్ప్రేతకృత్యం కుర్యాత్ ॥ హారీతశ్చ = భస్మాస్థీని గృహీత్వాతు విప్రాణామనుశాసనాత్ । క్షీరప్రక్షాళనంకృత్వా తదస్థిప్రేతవద్దహేదితి వచనాత్ దగ్ధమస్థి పునర్గృహీత్వా స్వశాఖోక్త విధినా పైతృమేధికం కుర్యాత్ ॥ ఇత్యాహితాగ్నేః ప్రమాదమరణే । బుద్ధిపూర్వక మరణే పలాశవిధిః । అనాహితాగ్నేః ప్రమాదమరణే వికల్పఇతి యల్లాజీయే ॥



# దుర్మృత నారాయణబలి ప్రయోగః



దుర్మృతస్య పురుషాదేస్సంస్కారాత్పూర్వం వత్సరాన్తే షణ్మాసే త్రిమాసే త్రిపక్షే సద్యోవా తత్తత్కాలానుగుణం యథోక్తకృచ్ఛ్రాచరణ పూర్వకం నారాయణబలిం కృత్వా మంత్రసంస్కారం కుర్యాత్ ॥

ఏకాదశ్యాం శ్రవణనక్షత్రే రోహిణీనక్షత్రే యస్మిన్ కస్మిన్ దినేవా కర్తాస్నాత్వాఽఽచమ్య కృతప్రాణాయామో దేశకాలౌ సంకీర్త్య, అముకస్యాముకగోత్రస్యాముకశర్మణోఽముష్యచండాలాద్యైహిక

తస్య దుర్మృతస్య దుర్మృతిజనిత పిశాచత్వ నివృత్తిద్వారా ప్రేత సంస్కార యోగ్యతాసిద్ధ్యర్థం నారాయణబలిఙ్కరిష్యామి । ఇతిసఙ్కల్ప్య ॥ శ్రోత్రియాగారాదగ్నిమాహృత్య యత్రక్వచేతి విధినాఽగ్నింప్రతిష్ఠాప్య చరుంశ్రపయిత్వాఽభిఘార్య ప్రాచీనముదీచీనంవోద్వాస్య ప్రతిష్ఠితమభిఘార్య । అగ్నేరుపసమాధానాద్యగ్ని ముఖాన్తే "సహస్రశీర్ షాపురుషః" ఇతి పురుషసూక్తేన ప్రత్యృచం షోడశ పలాశసమిధోహుత్వా తథైవావదానధర్మేణ షోడశ చర్వాహుతీస్తత ఆజ్యాహుతీశ్చ హుత్వా స్విష్టకృజ్జయాది ప్రతిపద్యతే పరిషేచన బ్రహ్మవిసర్జనాన్తం కృత్వా, పునః పురుషసూక్తంజపిత్వా ఓం నమోనారాయణాయేతి మంత్రముచ్చార్య చరుశేషేణాగ్నేః పురతోదర్భేషు బలిందత్వాఽగ్న్యుపస్థానాది తంత్ర శేషం సమాప్య కేశవాదీన్ దామోదరాంతాన్ ప్రేతంచోద్దిశ్య త్రయోదశ బ్రాహ్మణావరాన్ భోజయేత్ ॥ కృష్ణపక్షే మృతిశ్చేత్సంకర్షణాదీన్భోజయేత్ ॥ బ్రాహ్మణాలాభే యథాలాభం వా భోజయేత్ । తత్ప్రకారస్తు = ఏకోద్దిష్టవిధానేనాన్నశ్రాద్ధఙ్కుర్యాత్ ॥ తతః కర్తా ప్రాణానాయమ్య దేశకాలౌసఙ్కీర్త్య - అముకస్యాముక శర్మణోఽముష్య చండాలాద్యైర్హతస్య దుర్మృతస్య దుర్మృతి జనిత పిశాచత్వ నివృత్తి ద్వారా ప్రేతసంస్కార యోగ్యతా సిద్ధ్యర్థం కేశవాదీన్ దామోదరాన్తాన్ సఙ్కర్షణాదీన్ (శ్రీ) కృష్ణాంతాన్వా శుక్లకృష్ణపక్ష మరణ భేదేనోద్దిశ్య అముకం గోత్రం శర్మాణమముంచోద్దిశ్య ఏకోద్దిష్ట విధానేన అన్నద్రవ్యేణ శ్రాద్ధంకరిష్యామీతి సఙ్కల్ప్య । ప్రేతార్థం ప్రాచీనావీతీ - అన్యత్రోపవీతీకుర్యాత్ ॥ సర్వత్ర కేశవాయనమః, నారాయణాయనమః, ఇత్యేవం ప్రకారేణ బ్రాహ్మణ నిమంత్రణాదికం కృత్వా కేశవార్థే, నారాయణార్థే, క్షణః కర్తవ్య ఇత్యాది ద్వాదశబ్రాహ్మణాన్ ప్రేతార్థమేకంచ నిమంత్రయేత్ ॥ గోమయేన మండలద్వయం చతురశ్రమేకం, ప్రేతార్థం వర్తులమేకమితి, పాదప్రక్షాళనంచ కృత్వాఽ

ఉచాంతాన్ప్రాఙ్ముఖానుపవేశ్య ప్రేతార్థముదఙ్ముఖముపవేశ్య । భవదను జ్ఞయా ప్రకారాంతం శ్రాద్ధకర్మకరిష్యామీతి సఙ్కల్ప్య ॥ అపహతా ఇత్యాది - భోజనపాత్రనిధానాంతం కృత్వా, పక్వాన్నాత్పాత్రద్వయే నోద్ధృత్య ఏకపాత్రస్థమన్నమాదాయ భవదనుజ్ఞయాఽగ్నౌ కరిష్యామి, కురుష్వేత్యనుజ్ఞాప్య-లౌకికాగ్నిముప సమాధాయ ప్రాగుదగగ్రైః దర్భైః పరిస్తీర్య తూష్ణీంసమంతం ప్రదక్షిణం పరిషిచ్య మేక్షణేనాదాయ కేశవాయ స్వాహేత్యాది ద్వాదశాహుతీర్హుత్వా - ఉత్తరంపరిషిచ్య । పాత్రా న్తరస్థమన్నమాదాయ ప్రేతాహుతిం హోష్యామీత్యుక్త్వా దక్షిణతోఽ ఙ్గారాన్నిరూహ్య "ప్రేతాయాముష్మై యమాయచస్వాహా" ఇతిహుత్వా హుతశేషంతత్పాత్రేషునిధాయ (అన్న) పరివేషణాది బ్రాహ్మణభోజ నాంతం కృత్వా హుతశేషం భుక్తిశేషంచమధ్వాజ్య తిలమిశ్రాణ్కృత్వా త్రయోదశ పిండాన్కృత్వా ప్రాగగ్రాన్దర్భానాస్తీర్య తేషు "కేశ వాయనమః" ఇత్యాదిభిః ద్వాదశపిండాన్ దత్వా తేషాముపర్యక్షతో దకం దత్వా దక్షిణాగ్రేషుదర్భేషు గోత్రాయ - శర్మణే - అముకాయ - ప్రేతాయ "ఏషపిండ ఉపతిష్ఠతు" ఇత్యేకం పిండందత్వా - తస్యోపరి తిలోదకం దత్వా, ప్రా...మ్య, దేశకాలౌ సఙ్కీర్త్య కేశవాదీన్ ప్రేతం చోద్దిశ్య మయాకృతేన నారాయణ బలి కర్మణా గో - శ - అముకస్య ప్రేతస్య చండాలద్వైర్హతస్య దుర్మృతస్య తజ్జనిత పిశా చత్వనివృత్తి ద్వారా ప్రేతసంస్కార యోగ్యతాఽస్త్వితి భవన్తోబ్రువన్తు- ఇతి బ్రూయాత్ । తతః పిండానప్సుప్రక్షిప్య స్నాయాత్ ॥

॥ ఇతి దుర్మృత నారాయణ బలిః ॥

## అవిశేషేణ విషాది నిమిత్తేన మరణే హోమవిశేషమప్యాహ

ఏవం దుర్మరణ ప్రాయశ్చిత్త నారాయణ బల్యనన్తరం ఆరబ్ధ శరీర

సంస్కారస్య అగ్నిసిద్ధ్యనన్తరం ఉక్త ప్రాయశ్చిత్తహోమం కృత్వా శరీరం సంస్కుర్యాత్ ॥ తదిత్థం ప్రాయశ్చిత్త హోమః కార్యః ॥

సూ = యద్యాహితాగ్ని ర్విషహతో మ్రియేతతస్య ప్రాయశ్చిత్తమ్ "నమో అస్తు సర్పేభ్యః" ఇతి తిసృభిశ్చతుర్గృహీతేనాజ్యేన జుహుయాత్ ॥ యద్యాహితాగ్నిరప్సు మ్రియేత తస్య ప్రాయశ్చిత్తమ్ "ఇమం మే వరుణ తత్త్వాయామి" ఇతి ద్వాభ్యాం చతుర్గృహీతేనాజ్యేన జుహుయాత్ ॥ యద్యాహితాగ్నిః పశుభ్యోమ్రియేత "ఆగావో అగ్మన్ - ఇన్ద్రో యజ్వనే" ఇతిద్వాభ్యాం పూర్వవజ్జుహుయాత్ ॥ యద్యాహితాగ్నిరశనిహతోమ్రియేత "మూర్ధానందివో అరతిం పృథివ్యాః" ఇతి పూర్వవజ్జుహుయాత్ ॥ యద్యాహితాగ్నిర్దంష్ట్రిభ్యోమ్రియేత "దగ్ంష్ట్రాభ్యాం మలిమ్లూన్ - యేజనేషు మలిమ్లవః" ఇతి ద్వాభ్యాం పూర్వవజ్జుహుయాత్ ॥ ఏతదేవాస్య ప్రాయశ్చిత్తం భవతీతి విజ్ఞాయతే ॥ అత్ర నిమిత్తస్య తుల్యత్వా దనాహితాగ్నేరపి తత్తదుక్త ప్రాయశ్చిత్తం భవత్యేవ ॥ ఏవం ప్రకారేణ సంకల్పే తత్తన్నిమిత్తముక్త్వా ప్రాయశ్చిత్తం కృత్వా సంస్కారః కార్యః ॥

## శవస్యా స్పృశ్యస్పర్శాదౌ ప్రాయశ్చిత్తాది, ధర్మసింధుసారే

శ్మశానే నీయమానశవస్య శూద్రాదిస్పర్శే శూద్రేణ వహనేవా । కుంభే సలిలమాదాయ పంచగవ్యం తథైవచ । సుమంత్రైరభిమన్త్ర్యాప స్తేన సంస్నాప్య దాహయేదితి । కృచ్ఛ్ర త్రియంచ కుర్యాత్ । సూతికా రజస్వలయోః స్పర్శేప్యేవమేవ, ప్రాయశ్చిత్తంతు పంచదశకృచ్ఛ్రాః । శూద్రేణ ద్విజదాహేతు చాంద్రాయణం పరాకః ప్రాజాపత్యాని సముచ్చయేన పుత్రాదిః కృత్వాఽస్థీని పునర్దహేత్, అస్థ్యభావే పాలాశ విధిః । రజకాది సప్తవిధాన్త్యజాతిస్పృష్టమరణేత్వేకత్రింశత్కృచ్ఛ్రాణి ।

దేశాన్తర మరణే పరాకద్వయమష్టౌ కృచ్ఛ్రాణివా । కృచ్ఛ్రత్రయం ప్రకు ర్వీత ఆశౌచ మరణేఽపివా । అర్ధదగ్ధశవేచితేరస్పృశ్యస్పర్శే కృచ్ఛ్రత్రియమ్ । ఏవం పుత్రాదయఃపిత్రాదేఃపాపినఃపాపానుసారేణ ప్రాయశ్చిత్తకాండోక్తం ప్రాయశ్చిత్తమ్। దుర్మరణాత్మఘాతాదినిమిత్తే పూర్వోక్తప్రాయశ్చిత్తం నారాయణబల్యాదికం చ కృత్వైవాన్త్యే కర్మకుర్యుః। ఏవముక్తప్రాయశ్చిత్తం వినా దాహాదికృతం వ్యర్థం భవేత్। ఉభయోశ్చ నరకః ॥

## అనాథ బ్రాహ్మణ సన్యాసినాం సంస్కారాదౌ

## అనాథ బ్రాహ్మణవహనాదౌ చ సద్యశ్శౌచ మాహ పరాశరః

అనాథ బ్రాహ్మణం ప్రేతం యే వహన్తి ద్విజాతయః । పదేపదే యజ్ఞఫలమానుపూర్వ్యాల్లభన్తి తే । న తేషామశుభం కించిత్పాపం వా శుభకర్మణామ్ । జలావగాహనాత్తేషాం సద్యశ్శౌచం విధీయతే ॥ అస గోత్రమబంధుం చ ప్రేతీభూతం ద్విజోత్తమమ్ । వహిత్వా చ దహిత్వా చప్రాణాయామేనశుద్ధ్యతీతి ॥ బంధుమిత్రాది రహిత బ్రాహ్మణ వహన స్పర్శన దహనాదౌ స్నానప్రాణాయామాభ్యాం శుద్ధిరిత్యర్థః ॥ అగ్నిస్పర్శోఽపి కర్తవ్యః ॥ బ్రాహ్మే = అనాథబ్రాహ్మణం దగ్ధ్వా పితృమేధ మహాయజ్ఞఫలం ప్రాప్నోతి మానవః । సన్యాసినాన్తు సంస్కర్తు ర్నాశౌచం నోదకక్రియా । అశ్వమేధఫలం తత్ర భవేన్నాస్త్యత్ర సంశయఇతి ॥ బోధాయనశ్చ = సర్వసంగనివృత్తస్య ధ్యానయోగరత స్యచ । న తస్య దహనఙ్కార్యాన్నాశౌచంనోదకక్రియా ॥ యేవహన్తి మహాత్మానం దృష్ట్వా స్పృష్ట్వా ద్విజాతయః । హయమేధఫలంతేషా మస్తీత్యేవం విదుర్బుధా ఇతి ॥ సంగ్రహే = యతీంద్రానాథనిర్హారే సద్యశ్శుద్ధిర్మహాఫలమితి ॥

## గర్భవతః బ్రహ్మచారిణశ్చ పిత్రాదివ్యన్య శవనిర్హరణ నిషేధమాహ మనుః

దహనం వహనం వాఽపి ప్రేతస్యాన్యస్య గర్భవాన్। న కుర్యాదుభయం తత్ర కుర్యాదేవపితుస్సదా॥ జ్యేష్ఠస్య చానపత్యస్య మాతులస్యాసుతస్య చేతి॥ దేవలః = బ్రహ్మచారీ న కుర్వీత శవదాహాదికాః క్రియాః। యది కుర్యాత్తతః కృచ్ఛ్రం పునస్సంస్కారమేవ చేతి॥

## తస్యైవ పిత్రాది వహనాదౌ వ్రతలోపోనాస్తీత్యాహతు ర్మనుదేవలౌ

ఆచార్యం స్వముపాధ్యాయం మాతరం పితరం గురుమ్। నిర్హృత్యతు వ్రతీప్రేతం న వ్రతేన వియుజ్యతే॥ భృగుః = మాతామహం మాతులం చ తత్పత్నీశ్చ చానపత్యకే। వ్రతీ సంస్కురుతే యత్ర వ్రతలోపో న విద్యత ఇతి। మాధవీయె = ఆచార్యం స్వముపాధ్యాయం గురుంవా పితరంచవా। మాతరం వా స్వయం దగ్ధ్వా వ్రతస్థ స్తత్రభోజనమ్॥ కృత్వా పతతి యత్తస్మాత్ప్రేతాన్నం నతు భక్షయేత్। అన్యత్ర భోజనఙ్కుర్యాన్నచతైస్సహ సంవసేత్॥ ఏకాహ మశుచిర్భూత్వా ద్వితీయాది దివసేషు ప్రేత కృత్యోత్తరకాలం స్నానాచ్ఛుధ్యతీత్యర్థః॥

## పర్యుషిత రజస్వలా సూతికా గర్భిణీ శవవహనే ప్రాయశ్చిత్తముక్తం బోధాయనేన

కృత్వాతు పఞ్చగవ్యస్య ప్రాశనంచ తథాగవామ్। గ్రాసం దత్వా యథాశక్తి గాయత్రీ జపమాచరేత్॥ బ్రాహ్మణానాంచ వాక్యేన ఘృతాగ్ని స్పర్శనేనచ। పుణ్యాహేనవిశుద్ధ్యేతనూత్రమన్యత్తు ధారయేదితి॥

సపిండానాం ప్రేతనిర్హరణస్య విహితత్వాదాశౌచాధిక్యమగ్ని స్పర్శనాదికంచ నాస్తీత్యాహ దేవలః

విహితన్తు సపిండానాం ప్రేతనిర్హరణాదికమ్। తేషాం కరోతి యఃకశ్చిత్తస్యాధిక్యం నవిద్యత ఇతి ॥

సమానోదక ప్రేతవహన దహనాదౌ దశాహాశౌచమాహుః మాండవ్యాదయః

శావేచ సూతకేచైవత్ర్యహాముదకదాయినః। శవవాహంతు కుర్యాచ్చేద్దశాహాన్తం భవేత్క్రియేతి ॥ ఆశౌచముదకదానం చ క్రియా ॥ సమానోదాః ప్రకుర్వీరన్ సంస్కారం వహనంయది। దశాహాన్తేన శుద్ధిస్స్యాత్ ॥ యస్సమానోదకంప్రేతం వహేద్వాఽథ దహేత్తువా। తస్యాశౌచందశాహంస్యాత్ ॥ అన్యేషాం యోనిబంధూనాంత్ర్యహం వివురితి ॥

ధర్మార్థం శవనిర్హరణే మానుషాస్థి స్పర్శనే శవదర్శనే

స్మృత్యర్థసారేతు – ధర్మార్థం శవనిర్హరణే స్నానాలంకార వహన దహనాదికే కృతే ద్విజానాం సచేల స్నానాత్ సద్యశ్శుద్ధిః మహాపుణ్యం శుభంచాయుశ్చ భవతి। తత్రాప్యనాథ బ్రాహ్మణ ప్రేత నిర్హరణే అనన్తం పుణ్యం శుభం చాయుశ్చవర్ధతే। ధర్మార్థముత్కృష్ట జాతిప్రేతనిర్హరణే సర్వేషాం సచేల స్నానాచ్ఛుద్ధిః। ధర్మార్థం స్వజాతి ప్రేతనిర్హరణే సచేల స్నాన ప్రాణాయామైశ్శుద్ధిః ॥

అఘూన్త కృత్యమాహ మనుః

అఘాన్తే అఘభాజ స్సంగవేస్నాత్వా గ్రామం ప్రవిశేయురితి। జనన మరణాశౌచాన్తే ఆశౌచిన స్సంగవేస్నాత్వా గృహం ప్రవిశేయు

రిత్యర్థః ॥ తథాస్మృత్యన్తరే = మృతేచ సూతకేచాన్తె సంగవే స్నాన మాచరేత్। సంగవాత్పరతస్స్నాన మార్తవేతు విశిష్యత ఇతి ॥ సంగ్రహేచ = ఆశౌచాన్తె కృతస్నానః స్వస్తివాచన పూర్వకమ్ । బ్రాహ్మణా న్భోజయేత్తత్ర శుద్ధయే విష్ణుతుష్టయ ఇతి ॥

## రాత్రి జననాదావాశౌచ కాలః

రాత్రౌ జన్మాది సంభవే అర్ధరాత్రాత్పరం జన్మాదౌసతి పరదినమ్। పూర్వం తదుత్పత్తౌ పూర్వదినమిత్యేకః కల్పః ॥ రాత్రింత్రేధా విభజ్య ఆద్యభాగద్వయే జననాదౌ పూర్వదినం గ్రాహ్యమ్ । ఉత్తరభాగే పర దినమితి ద్వితీయః ॥ ప్రాగుదయాదిత్యపరః కల్పః ॥ తథా విజ్ఞానేశ్వ రీయె = అర్ధరాత్రావధిఃకాలః సూతకాదౌ విధీయతె। రాత్రింకుర్యాత్త్రి భాగన్తు ద్వౌభాగౌ పూర్వఏవతు ॥ ఉత్తరాంశః ప్రభాతేన యుజ్యతే మృతసూతకె । ఋతౌచసూతకెశావే తృతీయాంశః పరాన్వితః ॥ ఆద్యౌ ద్వావంశకౌ యుక్తౌ పూర్వేణాహ్నేతి నిశ్చయః । ఉదితేతు యదా సూర్యేనారీణాం దృశ్యతేరజః ॥ జననం వా విపత్తిర్వా యస్యాహస్తస్య శర్వరీ । రాత్రావేవ సముత్పన్నే మృతే రజసి సూతకె । పూర్వమేవ దినం గ్రాహ్యం యావన్నాభ్యుదితో రవిః ॥ తేషాం చ కల్పానాం దేశా చారేణ వ్యవస్థేతి ॥ అతఏవ స్వదేశాచారానుసారిణా తుణ్డీరమణ్డలీయేన సంగృహీతమ్ = త్రియామాయాస్తృతీయాంశే యది జన్మర్తు మృత్యవః । ప్రభాతాది యదిద్వ్యంశే పూర్వాహాద్యఘమిష్యత ఇతి ॥ పాదోన చతు ర్నాడికారూప సన్ధ్యాకాల రహితా రాత్రిస్త్రియామా ॥ అత్రాహుః = తృతీయభాగె సంప్రాప్తె మలం స్యాన్నిశిచేత్త్రియః । ప్రభాతాది త్రిరాత్రేణ శుద్ధింతస్యా వినిర్దిశేత్॥ ప్రత్యూషి జన్మ మరణేస్యాతాం యది పరందినమ్ ॥ ఇతి వృద్ధ పరాశర స్మరణాత్, "రాత్రింకుర్యాత్త్రి భాగన్తు" ఇత్యాదీని వచనాని రజోమాత్ర విషయతయా సంకోచనీయాని,

జన్మమరణయోస్తు అరుణోదయాద్యేవ దినం గ్రాహ్యామితి ॥ కేచిత్తు = “సూతకె మృతకెచైవ యదఘం పరికీర్తితమ్ । తేచే త్సూర్యోదయాద ర్వాగ్దినమేకన్తు తద్భవేత్” ఇతి వచనాజ్జన్మ మరణయో రుదయాద్యేవ దినం గ్రాహ్యామిత్యాహుః ॥ యథాచారమిహ వ్యవస్థా ॥



# పలాశవృంతాదిభిః పునస్సంస్కారవిధిః

యది పిత్రాదీనాం మరణకాలే దేశకాలవైపరీత్యాదిభిః మర్మరత్తై ర్వా సంస్కార కృత్యం న కుర్వీత తదా సంవత్సరమధ్యేఽపి పునస్సం స్కారస్య మలమాసమౌఢ్యాది దోషాభావేన భద్రతిథి త్రిపదర్క్ష భృగ్వంగార బృహస్పతివార ధనిష్ఠాపంచకవ్యతిరిక్త శుద్ధదినె చంద్ర తారాబలాన్వితే పునస్సంస్కారముపక్రమేత్ ॥ యద్యస్థిచేదస్థిభిరేవ పున ర్దాహః । అస్థ్యభావే త్రీణి షష్టిశతాని పలాశవృంతాన్యాహృత్య తైశ్శరీరాకృతిం వక్ష్యమాణప్రకారేణ పర్ణవల్కైః కుశైరూర్ణా సూత్రేణ వా సంధిషు సంవేష్ట్య కుర్వన్తి । జయన్త కారికాయామ్ = శరీరాణి న విందేరన్ దేశాన్తర మృతస్యచెత్ । దద్యాచ్ఛిరస్య శీత్యర్ధం గ్రీవాయాన్తు దశైవతు ॥ ఉరసి త్రింశతం దద్యా ద్వింశతిం జఠరె తథా । బాహ్వో ర్ద్వయోశ్శతం దద్యాద్దశబాహ్వఙ్గులీషుచ ॥ ద్వాదశార్ధం వృషణయో రష్టార్ధం శిశ్నఏవతు । ఊర్వోర్ద్వయోశ్శతం దద్యాత్ షష్ట్యర్ధం జాను జంఘయోః ॥ దశపాదాఙ్గులీషుస్యురూర్ణాసూత్రేణ బంధయేత్ । స్నాప్యాలఙ్కృత్య తద్రూపం కుర్యాత్తస్యాభిమర్శనమితి ॥ శౌనకః = కృష్ణాజినేతు పాలాశవృంతైః కృత్వా నరాకృతిమ్ । చత్వారింశచ్ఛిరో గ్రీవా దశవింశత్యురస్యపి ॥ పంచచత్వారింశద్బాహ్వోః పంచపంచభి

రజ్జులౌ । త్రింశత్సంఖ్యోదరే శిశ్నబీజేఽష్టౌ ద్వాదశక్రమాత్ ॥ పంచ
షష్టిర్ద్వే పదయోరజ్జులౌ పంచపంచభిః । త్రిశతాని చ షష్టిశ్చ పాలాశం
వృంతమాహరేత్ ॥ అలాభే యజ్ఞవృక్షాణాం వృంతాన్యపి సమాహరే
దితి ॥ స్మృత్యన్తరేఽపి = తావద్భిః పాలాశపత్రైశ్శరీరాకృతిరిత్యేకే ॥
కుశైరిత్యన్యే ॥ పర్ణశరైరిత్యపరే ॥ తత్రైవ = దేశాన్తరే ప్రమీతస్య నర
స్యాస్థి పునర్దహేత్ । అస్థ్యభావే పలాశోత్థైర్వృంతైః ప్రతికృతిం
దహేత్ ॥ తదభావే కుశైస్తేషాం షష్ట్యాచ త్రిశతైరపి । చత్వారింశచ్ఛిర
ఇత్యాది - ఊర్ణా సూత్రేణ బంధనమిత్యన్తం పూర్వవత్ ॥ పితృమేధ
సారేతు = పలాశవల్కైః కుశైర్వాసంధిషు సంవేష్ట్య చత్వారింశతా
పలాశవృంతైశ్శిరః ప్రకల్పయతే దశభిర్గ్రీవాం వింశత్యోర స్త్రింశ
తోదరం పంచాశతైకైకం బాహుం తయోరేవ పంచభిరంగులీ స్సప్త
త్యైకైకం పాదం తయోరేవ పంచభిరంగులీరష్టాభిశ్శిశ్నం ద్వాదశభి
ర్వృషణమేవం పురుషాకృతిం కృత్వా ప్రేతమావాహ్య సంస్నాప్యా
లంకృత్యాగ్నిముత్పాద్య సంకల్ప్యాపరేణాగ్నిం “ సర్వస్య ప్రతిశీవరీ ”
ఇత్యే తదాది ప్రతిపద్యతే । తాంఘృతేనాభ్యజ్య దహేదితి ॥

తత్ర సంకల్పః । యథాసంభవమ్ ॥ షష్ఠ్యన్తం గోత్రనామ సం
కీర్త్య - అస్థ్యభావే పలాశవృంతైః - కుశైః - పలాశ పత్రైః - పర్ణ
శరైః - యజ్ఞవృక్షాణాం వృంతైర్వా- ఏతేషామన్యతమేన యథాసంభవం
సంకీర్త్య పూర్వోక్తవచ్ఛరీరాకృతిం కృత్వా ప్రేతమావాహ్యస్నాప్యా
లంకృత్యాభిమృశ్య పునస్సంస్కారంకరిష్యామీతిసంకల్ప్య-తత్తత్ప్రాయ
శ్చిత్తపూర్వకం గవాదిదాన పంచగవ్య సర్వప్రాయశ్చిత్తాదికం కృత్వా
ప్రేతేఽమాత్యా ఇత్యాది కర్మ ప్రతిపద్యతే సమానమత ఊర్ధ్వమితి ॥

॥ ఇతి పునస్సంస్కార క్రమః ॥

# అనాహితాగ్ని బ్రహ్మమేధ ప్రయోగః

"అథాతో బ్రహ్మమేధ విధిం వ్యాఖ్యాస్యామః" ఇత్యాది "సన్తిష్ఠతే బ్రహ్మమేధః" ఇత్యన్తమ్ సూత్రమ్ ॥

అత్రాపి పైతృమేధిక ప్రయోగోక్తాని 'ఆపత్కాలె ముమూర్షుభిరనుష్ఠేయాని' ఇత్యారభ్య తిలపాత్రదానాన్తం సర్వమనుష్ఠాయ కర్ణమన్త్ర జపేవిశేషః। (౧) యద్యాచార్యస్య, శ్రోత్రియస్య, వా మరణసంశయె 'బ్రహ్మ విదాప్నోతిపరమ్, భృగుర్వై వారుణిః' ఇత్యనువాకనామకం (ప్రశ్నద్వయమ్) శాన్తిపూర్వకం బ్రహ్మవిదో దక్షిణే కర్ణే జపతి। జీవదశాయా ముపవీతినా। యదిప్రేతి ప్రాచీనావీతినైవ ॥ 'అథ ప్రేతస్య స్నానాలంకరణాది' ఇత్యారభ్య యథాక్రమం షణ్ణిమిత్త ప్రాయశ్చిత్తం కృత్వా సంస్కర్తా బ్రహ్మమేధ సంస్కార యోగ్యతా సిద్ధ్యర్థం పూర్వవత్ ప్రాజాపత్య కృచ్ఛ్రత్రయం చరిత్వా, సిద్ధాగ్నేః ప్రేతస్య సంస్కారసంకల్పః। విచ్ఛిన్నాగ్నేస్తు పూర్వవత్ప్రేతాగ్ని సంధానఃఔపాసన హోమం, విధురస్యాపి యథా శాస్త్రముత్తపనాగ్నిముత్పాద్య సంభావిత దుష్టకాలమరణ

ప్రాయశ్చిత్తం చానుష్ఠాయ పరిషదనుజ్ఞాంలబ్ధ్వా (౨) దర్భే
ష్వాసీన ఇత్యాద్యేకపవిత్రేణ కృత ప్రాణాయామః శ్రీ గోవిం
దేత్యాది దేశకాలౌ సంకీర్త్య - ప్రా...తీ గోత్రం శర్మాణం
అముకపితరం ప్రేతం పరమనిశ్శ్రేయసార్థం అముకాగ్నినా
బ్రహ్మమేధవిధినా సంస్కరిష్యామి - ఇతిసఙ్కల్ప్య । దక్షి
ణతో దర్భాన్నిరస్యాపః ... శ్య - అముకాగ్నిం పూర్వవత్ప్రరి
స్తీర్యేత్యాది సర్వస్యప్రతిశీవరీతి సంవేశనాన్తఙ్కుర్యాత్ ।

(3) సూ = అథాప్యుదాహరన్తి = హోతృాంశ్చ పితృమేధంచ
సంసృజ్య విధిరుత్తరః । విహితశ్చ సమానేన క్రతూనా
ముత్తమః క్రతురితి ॥

☞ అస్మిన్ బ్రహ్మమేధే పితృమేధ మన్త్రైః బ్రహ్మ
మేధమన్త్రాణాం సముచ్చయః కార్యః । తత్ర పూర్వం
పితృమేధ మన్త్రానుక్త్వా బ్రహ్మమేధమన్త్రా వక్తవ్యాః ।
అపిచ సంవేశనమ్ వస్త్రప్రపోర్ణనమ్ వస్త్రాపాదానమ్ ఔషధ్యాణా
మనుమన్త్రణమ్ పర్యావర్తనమ్ దహనదేశసంమార్జనమ్
సంసర్పణమ్ (వ్యుదసనమ్) ఇత్యేతాని పితృమేధ మన్త్రైరేవ

క్రియన్తే బ్రహ్మమేధేమంత్రైనుక్తైః, అతోఽన్యత్రి బ్రిహ్మమేధ మంత్రాణాం సముచ్చయః ॥

(౮) సూ = అన్వారబ్ధే మృతే అముకాగ్నా సువాహేతిం జుహోతి పరేయువాంసమితి । తస్య సగ్రిహైర్హోతృభి హోమః ॥

తతః కర్తా ప్రేతాగ్నా "పరేయువాగ్ంసం" ఇతి హుత్వా దశహోత్రాదిభిః "చిత్తిః పృథివ్యగ్ని స్సూర్యన్తే చక్షుర్మహాహవిహోతా" ఇతి పంచభిర్హోతృమన్త్రైర్వాచా ప్రయుక్తైః ప్రత్యనువాకమనువాకాన్తే జుహోతి-చిత్త్యాదీనాం 'వాచస్పతయె బ్రహ్మణ ఇదమ్।' శుక్లసూత్రేణేత్యాది చరు శ్రపణాన్తం పితృమేధవత్ । తతః ఇమౌయునజ్మీతి వాహకాను మంత్రణమ్ । అగ్న్యాది పదార్థానాం ప్రస్థాపనమ్ ।

సూ = ఆదీయమాన మనుమంత్రయతేపూషా త్వేతశ్చ్యావయ త్వితి । భర్తృసూక్తేన భరణమ్।

"పూషా త్వేతశ్చ్యావయతు, భర్తాసః" ఇత్యనువాకేన చ వాహకైరాదీయమానం ప్రేతమనుమంత్రయతే । గ్రామశ్మ శానయోరిత్యాది ప్రథమాధ్వని పథిబల్యన్తమ్ । పునరాదీయ

మానసం పూషేమా ఆశాః, భర్తాసన్నితిద్వాభ్యా మనుమంత్రి
ణాది ద్వితీయాధ్వని పథిబల్యన్తమ్ । పునశ్చాయుర్విశ్వాయుః,
భర్తా సన్నిత్యనుమంత్రిణాది చరుస్థాలీ భేదనాన్తమ్ । తూష్ణీం
చతుర్థమాదాయేత్యాది నాత్ర నైష్పురీష్య, రాజగవీ, పత్న్యుప
నిపాతనానాం ప్రసక్తిః, ఇత్యన్తమ్ ॥

(౭) సూ=హస్తౌ సంమార్ష్టి-సువర్ణేన బ్రాహ్మణస్య సువర్ణ
గ్ం హస్తాదితి । దక్షిణా ప్రతిగ్రహైర్ని మార్గః ।

(సువర్ణగ్ం హస్తాదిత్యుక్త్వా దేవస్యత్వేత్యనువాకేన
హస్తసం మార్గః ॥ ఇతి భాష్యమ్)

మతాన్తరేయథా=సువర్ణగ్ం హస్తాదిత్యృచా ప్రథమం
ప్రేతస్య హస్తౌసంమృజ్య "దేవస్యత్వా" ఇత్యాదిభిః ప్రతి
దక్షిణాప్రతిగ్రహం సంమార్గః ॥

౧. తద్యథా_సువర్ణమాదాయ "దేవస్యత్వా ...
హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి । రాజాత్వా... దేవిదక్షిణాఽగ్నయే
హిరణ్యమ్ । తేనామృతత్వమశ్యామ్ । ... ఉత్తానస్త్వాంగీరసః
ప్రతిగృహ్ణాతు । ఇతి ద్వాదశవాక్యాన్తై సువర్ణేన ప్రేతస్యహస్తౌ
సంమార్ష్టి ।

౨. దేవస్యత్వా···రాజాత్వా···దేవిదక్షిణై గ్నాస్త్వా ఒకృత్తన్నపస్త్వా౽తన్వత్తవరూత్రయస్త్వా౽వయం - సోమాయ వాసః । తేనామృతత్వం···ప్రతిగృహ్ణాతు। ఇతి వాససా పూర్వ వత్సంమార్గః ॥

౩. దేవస్యత్వా···దేవిదక్షిణైర్రుద్రాయగామ్ । తేనా మృతత్వం···గృహ్ణాతు । ఇతి గవా—

౪. దేవస్యత్వా ··· దేవిదక్షిణై వరుణాయాశ్వమ్ । తేనామృతత్వం···గృహ్ణాతు । ఇత్య శ్వేన—

౫. దేవస్యత్వా···దేవిదక్షిణై ప్రజాపతయేపురుషమ్। తెనామృతత్వం···గృహ్ణాతు । ఇతి పురుషేణ —

౬. దేవస్యత్వా ··· దేవిదక్షిణై మనవేతల్పమ్ । తెనామృతత్వం···గృహ్ణాతు । ఇతి తల్పేన—

౭. దేవస్యత్వా ··· దేవిదక్షిణై త్వష్ట్రే౽జామ్ । తెనామృతత్వం···గృహ్ణాతు । ఇత్యజయా—

౮. దేవస్యత్వా ··· దేవిదక్షిణై పూష్ణే౽విమ్ । తెనామృతత్వం ··· గృహ్ణాతు । ఇత్యవినా—

౯. దేవస్యత్వా···దక్షిణానిర్‌ఋత్యాఅశ్వతరగర్దభౌ।
తేనామృతత్వం···గృహ్ణాతు । ఇత్యశ్వతరగర్దభాభ్యామ్ ॥

౧౦. దేవస్యత్వా··· దక్షిణే హిమవతో హస్తినమ్ ।
తేనామృతత్వం···గృహ్ణాతు । ఇతి హస్తినా సంమార్గః ॥

౧౧. దేవస్యత్వా···దక్షిణేగంధర్వాప్సరాభ్యస్స్రగలం
కరణే। తేనామృతత్వం···గృహ్ణాతు। ఇతిస్రగలఙ్కరణాభ్యామ్—

౧౨. దేవస్యత్వా···దక్షిణా విశ్వేభ్యో దేవేభ్యోధా
న్యమ్। తేనామృతత్వం···గృహ్ణాతు । ఇతి ధాన్యేన—

౧౩. దేవస్యత్వా···దక్షిణా వాచేఽన్నమ్। తేనామృ
తత్వం···గృహ్ణాతు । ఇత్యన్నేన—

౧౪. దేవస్యత్వా···దక్షిణాబ్రహ్మణఓదనమ్ । తేనా
మృతత్వం···గృహ్ణాతు । ఇత్యోదనేన—

౧౫. దేవస్యత్వా···దక్షిణే సముద్రాయాపః । తేనా
మృతత్వం···గృహ్ణాతు । ఇత్యద్భిః—

౧౬. దేవస్యత్వా···దక్షిణఉత్తానాయాఙ్గీరసాయానః।
తేనామృతత్వం···గృహ్ణాతు । ఇత్యనసా—

౧౭. దేవస్యత్వా... దేవిదక్షిణె వైశ్వానరాయరథమ్ ।

వైశ్వానరః ప్రత్నథా... ఇత్యాది వాక్యచతుష్టయముక్త్వా-రాజాత్వా...దక్షిణె వైశ్వానరాయరథమ్ । తెనామృతత్వమశ్యామ్ ... ఉత్తానస్త్వాఙ్గీరసః ప్రతిగృహ్ణాతు । ఇతి రథేన సంమార్గః ।

అత్ర సర్వత్ర సంమృజ్యమాన వస్త్రాదిపదార్థాభావే ప్రత్యేకం గృహీతేన సువర్ణేన వా ప్రేతస్య హస్తయోస్సంమార్గః కార్యః ।

సూ=అథైనం చితావుపర్యధ్యూహతి, అథాస్య ప్రాణాయతనేషు హిరణ్యశల్కాన్ప్రత్యస్యత్యాజ్య బిందూన్వా। హృదయైర్హిరణ్య శకలాః ।

(౬) హృదయాని-సువర్ణం ఘర్మమిత్యాద్యనువాకాన్తామంత్రాః । అస్య (ప్రేతస్య) సప్తసుప్రాణాయతనేషు ఆస్య నేత్ర శ్రోత్రఘ్రాణేషు యథాక్రమం దక్షిణ సవ్యేషు సువర్ణం ఘర్మమితి సర్వమనువాకముక్త్వా సకృదేవాన్తతః హిరణ్యశకలాన్ క్షిపేత్ ఇత్యేకఃపక్షః ॥

అథవా సువర్ణం ఘర్మమిత్యాదినా చతుర్దశవాక్యాత్మకేన దశహోతృ హృదయేనాస్యే, బ్రహ్మేంద్రమిత్యాదినా ద్వాదశవాక్యాత్మకేన చతుర్హోతృ హృదయేన దక్షిణనేత్రే, శతంనియుత ఇత్యాదినా ద్వాదశవాక్యాత్మకేన పంచహోతృ హృదయేన సవ్యనేత్రే, సువర్ణం కోశమిత్యాదినా ద్వాదశవాక్యాత్మకేన షడ్ఢోతృ హృదయేన దక్షిణకర్ణే, ఇందో॰ రాజేత్యాద్యనువాకశేషేణ సప్తహోతృహృదయేన సవ్యకర్ణే, తేనైవ వృత్త్యా ప్రత్యేకం దక్షిణసవ్యఘ్రాణయోః ఇతిద్వితీయః ।

యదివా - సువర్ణం ఘర్మమిత్యాస్యే, బ్రహ్మేంద్రమితి దక్షిణనేత్రే, శతం నియుత ఇతి సవ్యనేత్రే, తేనైవ దక్షిణ కర్ణే, సువర్ణం కోశమితి సవ్యకర్ణే, ఇందో॰ రాజేత్యనువాకశేషేణావృత్త్యా దక్షిణసవ్యనాసికయోరితి తృతీయః పక్షః ॥

అత్ర తిల తండులాదీనాస్యే ప్రక్షిపన్తి పుత్రాదయః ।

సూ-అథైన ముపోషతి 'మైనమగ్నే, శృతంయదేతి ద్వాభ్యామ్ । జ్యోతిష్మతీభిరుపోషణమ్'

న నగ్నం దహేదిత్యాదిపితృమేధవత్ ॥ తూష్ణీమగ్నిమాదాయాదిత్యాభిముఖస్థిత్వా 'మైనమగ్నే' ఇతిద్వాభ్యామ్

'జ్యోతిష్మతీంత్వా' ఇత్యనువాకేన చ జ్వలదుల్ముకేనోరసి దహేత్ తతః కృత్స్నమగ్నిం పాత్రిగాదిప్రక్షిప్య జ్వలయేత్ ॥

సూ—అథైనముపతిష్ఠతే సూర్యన్తే చక్షురితి। నారాయణాభ్యా ముపస్థానమ్ ॥

ప్రేతాభిముఖః స్థిత్వా 'సూర్యన్తే చక్షుర్గచ్ఛతు' ఇతి 'సహస్ర శీర్షా, అద్భ్యః సమ్భూతః' ఇత్యనువాకాభ్యాం చ ప్రేతముపస్థాయ ॥

(౭) సూ—నవచస్రువాహుతీర్య ఏతస్య పథోగోప్తార ఇత్యత్రో భయం ప్రహరతి యేనజుహోతి। ప్రయాసాయస్వాహేతి స్రువాహుతీః।

ఉరస్థమగ్నిం ప్రజ్వాల్యాపరేణ చితిం ప్రాఙ్ముఖః స్థిత్వా 'యఏతస్యపథః' ఇతి నవభిః, 'ప్రయాసాయస్వాహా' ఇత్యను వాకేన చ ప్రతిస్వాహాకారం స్రువేణ హుత్వాఽఽజ్య స్థాలీం స్రువంచాగ్నౌ ప్రహరేత్।

(౮) సూ—అపరేణాగ్నిం ప్రాఙ్ముఖ ఉపవిశ్యాథైనం యామ్యేన సూక్తేన నవర్చేన పరాచాఽనుశంసతి ప్రకేతునేతి। మృత్యు సూక్తేనానుశంసనమ్ ॥

అపరేణాగ్నిం ప్రాఙ్ముఖ ఉపవిశ్య ప్రకేతునేతి నవభిః ఋగ్భిః ప్రత్యృచం 'హరిగ్ం హరన్తమ్' ఇత్యనువాకేన చ (షడ్భిః ఋగ్భిః) కృతటిఙ్లోపాభిః ప్రణవాన్తాభిరేకశ్రుత్యా ప్రణవేన సన్ధాయోత్తరమన్త్రాదిమ్, అర్ధర్చాన్తేఽవసాయావసాయ శంసేత్॥ తథాచ 'ప్రకేతునా···రోరవీతి। దివశ్చిదన్తాదుప···థ్రో౼3 మిదన్త ఏకం...సంవిశస్వ। సంవేశనః ··· సధస్థో3 ం నాకేసుపర్ణ···త్వా। హిరణ్యపక్షం···భురణ్యో3మతిద్రవ··· పథా। అథాపిత్రౄన్ ··· మదన్తో 3 ం యాతేశ్వానా... నృచక్షసా। తాభ్యాగ్ం ··· థేహ్యో3మురుణసా ... అను। తావస్మభ్యం···భద్రో3 ం సోమ···ఉపాసతే। యేభ్యో··· గచ్ఛతో3 ం యేయుధ్యన్తే··· తనుత్యజః। యేవా.. గచ్ఛతో 3 ం తపసా···సువర్గతాః। తపోయె ··· గచ్ఛతో3మ్ ॥ హరిగ్ం హరన్త···మతీనామ్। బ్రహ్మ ··· విక్రమస్వో3 ం మాభిదో ··· ప్రమోషీః। ప్రజాంమా ... విధేమో3 ం సద్యశ్చకమానాయ ··· మృత్యవే। ప్రాస్మా··· పునో3 ం కామేన ··· మృత్యోః। యదమీవాసా ··· మామభో3 ం పరం మృత్యో ··· దేవయానాత్। చక్షుష్మతే ··· మోతవీరో3 ం

ప్రపూర్వ్యం···చర్షణీనామ్ । యః ప్రజానా ··· ప్రథమజా

మృతస్యా3మ్ ॥ ఏవమేకశ్రుత్యా శంసనం కార్యమ్ ॥

(౯) సూ=జఘనేన దహనదేశముదీచీస్త్రిస్రః కర్షూః ఖాత్వా

ఒశ్మభిస్సికతాభిశ్చోప (శ్చాభి) ప్రకీర్యాయుగ్భిరుదకుంభై

రపఃపరి ప్లావ్య తాసు జ్ఞాతయ స్సంగాహన్త్ఒశ్మన్వతీ రేవతీ

రితి। గతమ్ ।

సౌమ్యాసంగాహనమ్॥ ఆప్యాయస్వమదిన్తమేత్యృచా॥

సూ=జఘనేనకర్షూః పలాశశాఖే శమీశాఖేవా నిఘ్నన్త్యన్తర్ధా

నే దర్భమయేన శుల్బేన సంబధ్య తే అన్తరేణ ప్రసర్పన్తి

యద్వైదేవస్య సవితుః పవిత్రమితి, జఘన్యశ్శాఖవ్యుదస్యతి

యారాష్ట్రాత్పన్నాదితి ॥ గతమ్ ॥

సూ=ఉద్వయం తమసస్పరీత్యాదిత్య ముపస్థాయ । సౌర్యేణా

దిత్యోపస్థానమ్ ।

అథ సర్వే కర్తారః జ్ఞాతయోఽపి 'ఉద్వయంతమసస్పరి'

'తరణిర్విశ్వదర్శతః' ఇత్యనువాకేన చ ఆదిత్యోపస్థానం కుర్యుః।

ప్రాచీనావీతినైవ ॥

సూ—అనవేక్షమాణా అపోఽవగాహన్తే ధాతాపునాతు సవితా

పునాత్వితి । పృష్ట్వాఽవగాహనమ్ ॥

శ్మశానమనవేక్షమాణా అపోగత్వా కేశాన్ప్రకీర్యపాం

సూనోప్యాతుర వ్యంజనాని కృత్వా 'ధాతాపునాతు సవితా

పునాతు' 'ఈయుష్టైయె' ఇతిమన్త్రాభ్యాముక్తక్రమేణ

స్నానం కుర్యుః ॥

సూ—సమానమత ఊర్ధ్వం పైతృమేధికం (ఆయవౌదనప్రాశ

నాత్) కర్మ ॥ (౧౦) శాంక సరంబ్రహ్మోత్యాచక్షతే ॥

అపామువగాహనాదూర్ధ్వం పైతృమేధికముదకదానాస్థి

సంచయనాది శాన్తిహోమాన్తం సమమేవేత్యర్థః ॥

శ్మశాన సాధారణేశ్మశానేప్రయుంజీత, నానాచార్యాయ

నాశ్రోత్రియాయ ॥

॥ సంతిష్ఠతే బ్రహ్మమేధః ॥



# బ్రహ్మమేధ ప్రకరణమ్

(౧) అనువాకా ఇత్యస్య ప్రశ్నద్వయమిత్యుపనిషద్భాష్యోక్తిః । తథాచ యాతుదేశవిశేషే బ్రహ్మవిదిత్యారభ్య నవానువాకా ఇతిప్రసిద్ధిః సాత్వధ్యాపకైః పాఠసౌకర్యాయ పరికల్పితా, నత్వర్థానుసారిణీ । తేహి "తదప్యేషశ్లోకోభవతి" ఇత్యస్యాః ప్రతిజ్ఞాయాః శ్లోకపాఠస్యచ మధ్యే తంతమనువాకం సమాపయంతి । నచైతద్యుక్తమ్ । కస్యచిదప్యర్థస్య పర్యవసానాభావాత్ । తస్మాదితప్రదేశగతాధ్యాపక ప్రసిద్ధ్యా కృత్స్నోఽప్యయమేక ఏవానువాకః । ఏతదేవాభిప్రేత్య కాండానుక్రమణికా భాష్యకారః, వారుణ్యా ఉపనిషదః "సహనావవతు" "బ్రహ్మవిదాప్నోతిపరమ్" "భృగుర్వైవారుణిః" ఇత్యనువాకత్రయాత్మకత్వం వ్యాజహార । భారద్వాజసూత్రే ముమూర్షోః కర్ణే జప్యత్వేనైవముదాహృతమ్--"బ్రహ్మవిదాప్నోతిపరమ్, భృగుర్వైవారుణిః" ఇత్యేతావనువాకౌ బ్రహ్మవిదోదక్షిణేకర్ణేజపతీతి । బ్రహ్మవిదిత్యారభ్య భృగురిత్యంతః (త్యతః) ప్రోక్తనోగ్రంథ ఏకఏవానువాకః । యేషాంనవానువాకకల్పనా తేషామప్యేకవల్లీత్వప్రసిద్ధిరస్తి । బ్రహ్మవల్లీత్యేవంతైర్వ్యాఖ్యాతత్వాత్ । భగవద్భిర్భాష్యకారైరస్యానందవల్లీత్యేవం వ్యాహృతమ్ । అతోబహుస్కన్ధయుక్తవల్లీవద్బహువిధావాంతరపాఠభేదయుక్తోఽప్యేకఏవాయమనువాకః । ఏవంభాష్యకారమతేన భృగుర్వైవారుణిరిత్యారభ్య "ఇత్యుపనిషత్" ఇత్యంతోఽయం నవమ ప్రపాఠకో నాస్తి కింత్వష్టమస్యైవాయం తృతీయోఽనువాక ఇతీదమప్యూహ్యామితి ॥ అస్మిన్విషయే కపర్దిగోపాలభాష్యయోరుక్తివిశేషాభావాదుపనిషద్భాష్యోక్తిపదనుష్ఠానం యుక్తమిత్యవగమ్యతే । బ్రహ్మవిదః_వేదతదర్థజ్ఞస్య+బ్రహ్మనిష్ఠస్యవా । జపతీత్యేకవచనంకర్తైకఏవ జపేత్, తదసన్నిధౌ సన్నిహితోఽన్యోవా జపే

దితి ప్రదర్శనార్థమ్, విశేషానుపాదానాత్ ॥ మరణానంతరమపి ప్రాచీనావీతినా ఏతన్నియమేన కర్తవ్యమ్ । బ్రహ్మవిద ఇత్యేవ "తానసాధారణే శ్మశానె ప్రయుంజీతనానాచార్యాయ నాశ్రోత్రియాయ" ఇతీతరనిషిధస్య వక్ష్యమాణత్వాత్ ॥

(౨) అయంబ్రహ్మమేధః ఉక్తగుణవిశిష్టస్య బ్రాహ్మణస్యైవ పరమశ్రేయసార్థం విధీయతే, నత్వవిశిష్టస్య, స్త్రియాశ్చేతి భాష్యమ్ ॥ అత్రసూత్రమ్—ద్విజాతీనామపవర్గోహ్యర్థతస్తత్వదర్శిభిః । ఋషిభిస్తపసోయోగాద్వ్యాప్తితుంపురుషోత్తమమితి ॥

(౩) హౌత్ర్యాంశ్చపితృమేధంచసంసృజ్యవిధిరుత్తరః । ఇతి హౌత్రపితృమేధమంత్రయోస్సమావేశే "అపూర్వమన్తేస్యాత్" ఇతి న్యాయేన పితృమేధ మంత్రానుక్త్వా, హౌత్రమంత్రావక్తవ్యాః । సంవేశనాద్యష్టపదార్థేషు బ్రహ్మమేధమంత్రాంతరానుక్తిః, పితృమేధమంత్రైరేవక్రియాః కార్యాః । తథాహి। దర్భేషుసంవేశయన్తి "సర్వస్యప్రతిశీవరీ" ఇతి । వాససాప్రోర్ణోతి "ఇదంత్వావస్త్రమ్" ఇతి । అథాస్యేతరదపాదత్తే "అపైతదూహ" ఇతి । "ఇమౌయునజ్మితేవహ్నీ" ఇత్యేషయోజన ఆమ్నాతః । పరియంతి "అపనశ్శోశుచదఘమ్" ఇతి । శ్మశానాయతనంసంమార్ష్టి "అపేతవీత" ఇతి। అంతరేణపరిసర్పంతి "యద్వైదేవస్య" ఇతి । శాఖెవ్యుదస్యతి "యారాష్ట్రాత్పన్నాదితి" ॥

(౪) చిత్తిఃపృథివీత్యాదిపంచభిః పంచసువాహుతయోహోతవ్యాః 'వాఘ్హోతా' ఇత్యత్రనేష్యతే "అథైషఋతుముఖీయఇతి తస్య ఋతుముఖమాత్రవిషయత్వవచనాత్"ఇతి గోపాలభాష్యమ్॥ షడ్భిరనువాకైరితి, పితృమేధసారే ॥ వాచాపమ్ముక్తైరిత్యస్యార్థః కపర్దిభాష్యే = సూత్రె సగ్రహైహోమ ఇతినవక్తవ్యమ్ । యత్రయత్రహోమాథా ఇతి సిద్ధత్వాత్। ఇహాస్తివిశేషః । అన్యత్రతు హోతా మనసైవోచ్యతే, ఉపాంశు

గ్రహేణహోతవ్యమితి । ఇహ సగ్రహేణహోత్రా హూయతే, న మనసా ప్రయోగః ॥ పరేయువాంసమితి హుత్వాఽనాహితాగ్నేరౌపాసనే గ్రహైస్సహితాన్ హోతౄన్ గ్రహదేవతా మనసాధ్యాత్వా జుహుయాదితి ॥

## హస్తసంమార్జనమాదౌ పితృమేధమన్త్రేణ కృత్వా పశ్చాద్బ్రహ్మమేధమన్త్రేణ

(౫) అనుషఙ్గః "అగ్నయే హిరణ్యమ్, సోమాయ వాసః" ఇత్యాదిషు సప్తపదస్స్వన్యయాత్సప్తపదవిధిః । దక్షిణాప్రతిగ్రహః "దేవస్య త్వా" ఇత్యాద్యాః పూర్వోక్తాస్సప్తపదానుషఙ్గాః । తథా "పరేయువాంసమ్" ఇతి హుత్వా చిత్త్యాదిభిః ప్రతిహోతృహోమః, ఏనముపోషణోపస్థాన స్రువాహుతి శంసనావగాహనాదిత్యోపస్థానావగాహనాదీని పితృమేధమన్త్రేణ ప్రాక్కృత్వా పశ్చాద్బ్రహ్మమేధమన్త్రేణ కార్యాణి । వచనాదనేకమన్త్రకమేకం కర్మ, వచనాభావే త్వేకమన్త్రకమేకకర్మేతి సామాన్యసిద్ధమ్ । కిఞ్చ-భరణే ఉభయమన్త్రాన్తఏవ స్థలత్రయనిధాన విధానం మధ్యేనిధానాయోగాదితి విశేషః । అపిచ, ఇహ ప్రతిగ్రహాభావేఽప్యనాదౌ సంసారే పునరసంభావితార్థాభావాత్ప్రభవాన్తర ప్రతిగ్రహదురితక్షయాయ సంమార్జనః కార్యః, విహితత్వాత్ । అన్యథా ప్రత్యగ్రహన్మన్త్రలోపే కర్మాసిద్ధిశ్చ ॥ కేచిన్మన్దధియః "గన్ధర్వాప్సరాభ్యస్స్రగలంకరణే" ఇతి ద్వావనుషఙ్గౌ మన్యన్తే తాన్ప్రత్యాహ "గన్ధర్వాప్సరసో వా ఏతమ్" "గన్ధర్వాప్సరసాం గృహాః" ఇత్యాదిషూభయోరవిభాగదర్శనాత్ "తస్మై స్వాహా తాభ్యస్స్వాహేతి జుహోతి" ఇతి చోదనావశాదేకహోమే విభాగాత్ "గన్ధర్వాప్సరాభ్యస్స్రగలంకరణే" ఇత్యనయైవశ్రుత్యా గన్ధర్వాణామప్సరసాం చావిభాగేన స్రగలఙ్కరణోద్దేశత్వప్రతిపాదనాత్, పూర్వాపరవాక్యేష్వేకైకానుషఙ్గస్యైకైక వాక్యత్వ

దర్శనాత్, పృథగనుషఙ్గే భాష్యోక్తసప్తదశసంఖ్యావిరోధాచ్చ గంధ
ర్వాప్సరాభ్యోవ్రాత్యమిత్యాదినచైకఏవ న పృథగనుషఙ్గ ఇతి ॥

## తేనేతి తచ్ఛబ్దస్య లిఙ్గాదిభేదవిచారః

తేనామృతత్వమిత్యత్ర తచ్ఛబ్దస్య ప్రకృతపరామర్శిత్వాదశ్వతర గర్దభావితిమంత్రే తాభ్యామిత్యాది వక్తవ్యమితిమూఢచోద్యంనిరస్యతి॥ సర్వానుషఙ్గేషు తచ్ఛబ్దస్య న లిఙ్గవచన భేదః, కారణపరత్వాత్ప్రతిగ్రాహ్య ద్రవ్యపరామర్శాభావాచ్చ, లిఙ్గమ్ - స్త్రీత్వాది, వచనమ్ - ఏకత్వాది, తచ్ఛబ్దస్యలిఙ్గభేదోవచన భేదశ్చనాస్తి, కుతః, కారణపరత్వాత్ - రుద్రాయ గాం ప్రతిగృహ్ణామీతియతః తేన తస్మాత్కారణాదితి కారణపరత్వాదిత్యర్థః "తేనత్వా౽౽యుషా౽౽యుష్మన్తంకరోమి" ఇతివత్ । అతోనాత్రప్రతిగ్రాహ్యగవాదిపరామర్శ స్సర్వానుషఙ్గేషు । అతఏవహి శ్రౌతస్మార్తవిచక్షణాః "తేనామృతత్వమ్" ఇత్యేవ యథాపాఠం పఠన్తీతి ॥

## హిరణ్యశకలక్షేపమంత్రవిభాగే పక్షత్రయముక్తమ్

(౧) తత్రాద్యంపక్షద్వయం కపర్దిభాష్యోక్తమ్ । తృతీయస్తు గోపాలభాష్యోక్త ఇతిజ్ఞాతవ్యమ్॥ ఏవంపక్షత్రయోక్తిః శ్రౌతన్యాయాత్ సూత్రే ప్రతిశేషానుక్తేః ॥ ఆజ్యబిందూన్వా౽వనయేదితి హిరణ్యశకలాభావ పక్షః, నారాయణాభ్యామ్ "సహస్రశీర్షా, అద్భ్యస్సంభూతః" ఇత్యనువాకాభ్యామ్ ॥

(౨) ప్రయాసాయ స్వాహేతిస్త్రివాహుతీరిత్యత్ర బహువచనాత్ప్రతిస్వాహాకారం హోమసిద్ధిః ॥

(౩) యామ్యసూక్తమ్ "ప్రకేతునా" ఇత్యాది "తపోయేచక్రిరేమహస్తాగ్ం శ్చిదేవాపిగచ్ఛతాత్" ఇత్యన్తమ్ । "యమస్యయోనాః

యమస్యదూతా” ఇత్యాదిమంత్రలిఙ్గాత్ । మృత్యుసూక్తమ్ “హరిగ్ం హరన్తమ్” ఇత్యనువాకః, “మాఛిదోమృత్యో”ఇతిమంత్రలిఙ్గాత్ । కృతటిలోపాభిః-అత్ర టేరదర్శనాట్టిలోప ఇత్యుపచర్యతే । టేఃస్థానేప్రణవః ప్రయోక్తవ్య ఇత్యర్థః । తథాపాణినిః । ప్రణవష్టేః । ఇతి । యజ్ఞకర్మణిఋగన్తస్య టేః ప్రణవో భవతీత్యర్థః । ఆశ్వలాయనశ్చ=స్వరాదిమృగన్తమోఙ్కారం త్రిమాత్రంకృత్వా । ఇతి । అయమర్థః “ప్రకేతునా” ఇత్యత్ర “వవర్ధ” ఇత్యత్ర అకారష్టిః । “సధస్థే” ఇత్యత్ర ఏకారః । “భురణ్యుమ్” ఇత్యత్ర ఉకారమకారౌ । “అచోన్త్యాదిటి” ఇతిస్మృతేః । తత్ర టేః స్థానే ప్రణవాదేశే కృతే స్వరాది ఋగన్తమోఙ్కారాన్తం భవతీతి తమోఙ్కారాన్తఙ్కుర్యాత్ । స్వరఇత్యన్త్యస్వర ఏవోచ్యతే । ఆదిశబ్దేనస్వరాత్పరం వ్యంజనముచ్యతే । ఋగన్తస్స్వరమాత్రాన్తశ్చేత్తం స్వరమోఙ్కారఙ్కుర్యాత్ । వ్యంజనాన్తశ్చేత్స్వరవ్యంజనయోరుభయోస్థానే ప్రణవఙ్కుర్యాదితి । తతశ్చ, వవర్ధోమ్, సధస్థోమ్, భురణ్యోమ్, మదన్తోమ్, ధేహోమ్, భద్రోమ్, గచ్ఛతోమ్, ఇతి ఋగన్తమ్ । బ్రహ్మమేధే, విక్రమస్వోమ్, విధేమోమ్, అజనయన్నుపోమ్, మామభోమ్, మోతవీరోమ్, ప్రథమజామృతస్యోమ్, ఇతి శంసనంకార్యమ్। ఏకశ్రుత్యేతి “సర్వమేకయమం పూర్వేషామ్” ఇతివ్యాసః । “యజ్ఞకర్మణ్యజపన్యూంఖసామసు” ఇతి పాణినిః । ఉదాత్తానుదాత్తస్వరితానాం పరసన్నికర్ష ఐకశ్రుత్యమిత్యాశ్వలాయనః ॥

(౯) సౌమీ-“ఆప్యాయస్వమదిన్తమ” ఇత్యనువాకః । “ఆప్యాయస్వమదిన్తమసోమ” ఇతిమంత్రలిఙ్గాత్ ॥

(౧౦) తాన్ “పరమంగుహ్యం బ్రహ్మ” ఇత్యాదిశ్రుతాన్ చతుర్హోతౄన్ అనేకకులసాధారణే శ్మశానే న ప్రయుంజీత । కిన్తు ప్రేతకులస్యాసాధారణ ఏవేత్యర్థః । అపిచ, ఆచార్యాదన్యస్మై ప్రేతాయ

తాన్ న ప్రయుంజీత। అథవా సర్వేభ్యః శ్రోత్రియేభ్యః వేదార్థవిద్భ్యః ప్రయుంజీత, నతు కదాచిత్ అశ్రోత్రియాయ। ఏకశాఖాధ్యాయః శ్రోత్రియః । తాన్ హోతౄన్ సాధారణే శ్మశానే సర్వేషాం న ప్రయుంజీత । యస్మాత్ విశిష్టేభ్యో బ్రహ్మమేధః క్రియతే, తత్రైవదహనం నాన్యత్రేతి॥ ఆచార్యాయ ఛాత్రః కుర్యాత్ । అనాచార్యాయ, అశ్రోత్రియాయ న కుర్యాత్ ॥ తథా స్త్రీణాంచేతి ॥ సంస్థా సమాప్తిః ॥

# అథ సంచయన ప్రయోగః

సూ=అపరేద్యుస్తృతీయస్యాం పంచమ్యాం సప్తమ్యాం వా
　　ఒస్థీని సంచిన్వన్తి ॥

(౧) ఏవముక్తదివసే జ్ఞాతిభిస్సహ - ఆజ్యం పయః కుంభఘటాశ్మ దర్భావాసస్తిలోదుంబర పర్ణశాఖాః । ఫలం బృహత్యా అపి నీలరక్తసూత్రేచ శుల్బం సికతాబలిం (జలం) చ ॥ క్షీరముదకమాజ్యముదుంబరశాఖాం బృహతీఫలం నీలలోహితసూత్రె శిలామయుగ్మముదకుంభం ప్రేతభక్ష్య బలి పదార్థాన్ గంధోదకానిచ ॥ ఏతాం త్సంభారానాదాయ జ్యేష్ఠక్రమేణ శ్మశానదేశం గత్వా శుచౌ దేశే నిధాయ కర్తాస్నాత్వా

ఽఽచమ్య ఏకపవిత్రేణ బ్రహ్మదండం (అనుజ్ఞా ద్రవ్యం) నిధాయ (శుక్లాం+) ప్రా...మ్య పుణ్యతిథౌ - ప్రా...తీ (పితుః) గోత్రస్య+ప్రేతస్య (౨) మరణదినాదారభ్య అముకే ఽహని అస్థి సంచయనం కరిష్యామి - ఇతి సఙ్కల్ప్య । (౩) అస్థి సంచయనకాలే తిథివార + లగ్నైర్యోదోషస్తద్దోష పరిహారార్థం కృచ్ఛ్ర ప్రత్యామ్నాయం యత్కించిద్ధిరణ్యదానం కరిష్యే - హిరణ్యగర్భేతి హిరణ్యదానం కుర్యాత్ ॥ పునః ప్రా...మ్య సఙ్కల్ప్య (౪) శ్మశాన భస్మని శ్వ చండాల గర్దభ సృగాల క్రిమికీటాద్యస్పృష్టదూషితే తద్దోషపరిహారార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయం గోమూల్యదానం కరిష్యామీతి సఙ్కల్ప్య, తత్కృత్వా । శ్మశానభస్మ శుద్ధ్యర్థం పంచగవ్యేన చ ప్రోక్షేత్ ॥

సూ=క్షీరోత్సిక్తేనోదకేనౌదుంబరశాఖయాఽప్రకావ్రథయం ఛరీ

రాణ్యవోక్షతి యన్తే అగ్నిమమంథామేతి పంచభిః ॥

(౫) ఉదకే క్షీరం నినీయ ఉదుంబరశాఖయా అవి కలమ కుర్వన్నస్థీని యన్తే అగ్నిమితిపంచభిః ప్రతిమన్త్రమవోక్షతి ॥

" యన్తే అగ్నిమమన్థామ వృషభాయేవపక్తవే । ఇమ

స్తగ్ం శమయామసి క్షీరేణ చోద్దకేనచ॥ యన్త్వమగ్నే సమ
దహస్త్వము నిర్వాపయా పునః । క్యాంబూరత్రజాయతాం
పాకదూర్వావ్యల్కశా ॥ శీతికే శీతికావతి హ్లాదికే హ్లాదుకా
వతి । మండూక్యాసు సంగమయేమగ్ం స్వగ్నిగ్ం శమయ ॥
శన్తే ధన్వన్యా ఆపశ్శము తే సన్త్వనూక్యాః । శన్తే సము
ద్రియా ఆపశ్శము తే సన్తు వర్ష్యాః ॥ శన్తే స్రవన్తీస్తనువేశ
ము తే సన్తు కూప్యాః । శన్తే నీహారో వర్షతు శము పృథ్వాఽవశీ
యతామ్ ॥"

సూ = అత ఏవాఙ్గారాన్దక్షిణాన్నిరస్యత్రి తిస్రస్సమిధ ఆహుతీ
జుహోత్యవసృజేతి ప్రతిమన్త్రమ్ ॥

యదిశ్మశానాగ్నిర్నష్టస్స్యాత్తదా లౌకికాగ్నిం యత్రి
క్వచేతి విధినాప్రతిష్ఠాప్య అగ్నినష్ట ప్రాయశ్చిత్తం కృత్వా సంచ
యనహోమం కుర్యాత్ ॥ శ్మశానాగ్నిసత్వేదహనదేశాద్దక్షిణతో
ఽంగారాన్నిర్హృత్యోపసమాధాయపరిజ్వాల్యదక్షిణాప్రాగగ్రై
ర్దర్భైః స్సంపరిస్తీర్యాగ్నేర్దక్షిణతో దక్షిణాగ్రేషు దర్భేషు
ఆజ్యస్థాలీం ప్రోక్షణీం స్రువమిత్యేకైకశో దక్షిణాపవర్గం సాద

